# శ్రీదేవి

టి.సుబ్బరామిరెడ్డి



యష్ చోప్రా

శ్రీదేవి అందాలన్నీ
వెదజల్లిన రంగుల హరివిల్లు!

SURESH MOVIES FILM
DISTRIBUTORS

JAGATI Rs. 2-00 April 1990

35th Year of Publication

# జగతి

## ఎడిటర్: చందూర్

## ఏప్రిల్ - 1990

## సాహితీ సుధ

అతనికి వార్ధి కుల్యయగు అగ్ని జలంబగు మేరుశైల మం
చిత శిలలీల నుండు మదసింహము జింక తెఱంగు దాల్చు గో
పిత ఫణి పూలదండయగు భీష్మవిషంబు సుధారసం బగున్
క్షితి జనసమ్మతం బగు సుశీల మదెవ్వని యందు శోభిలున్

-భర్తృహరి



తప్పు లెన్నువారు తండోపతండంబు - ఉర్వి జనుల కెల్ల నుండు తప్పు
తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుగరు - విశ్వదాభి రామ వినుర వేమ

ఇనుము విఱిగె నేని యినుమారు ముమ్మాఱు - కాచి యతుక వచ్చు గ్రమముగాను
మనసు విఱిగె నేని మఱి చేర్చ రాదయా - విశ్వదాభి రామ వినుర వేమ

కనగ సొమ్ము లెన్నొ కనకంబు నొక్కటే - పసులవన్నె లెన్నొ పాలు నొకటె
పుష్పజాతు లెన్నొ పూజ యొక్కటె సుమీ - విశ్వదాభి రామ వినుర వేమ

—వేమన శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్: 76697-చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 జీవిత
చందా రు. 300.00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం: కృష్ణ, ఎమ్.పి.

# నిమ్మతొనలు

సుజాత, సౌజన్యారావు యిద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు - ప్రతి నెలా ఎవరి ఖర్చులు వారు అకవుంట్ పుస్తకంలో రాసుకుంటున్నారు.

'ఇదేమిటండీ - మీ చెప్పల్స్‌కయిన బిల్లు నా అకవుంట్‌లో వేశారు - అది మీ అకవుంటే' - అన్నది సుజాత.

'చెప్పులు నావేగాని ఆ ఖర్చు నీ అకవుంట్ కిందకే వస్తుంది,' - అని నెమ్మదిగా చెప్పాడు సౌజన్యారావు.

'ఇదేమి అన్యాయమండీ ?'

'అన్యాయం కాదు, న్యాయమే ! సంవత్సరం వచ్చే చెప్పులు, నాలుగు నెలలలో అరిగిపోవడానికి కారణం, నీ నవల గురించి కనుక్కోవడానికి ఆ పత్రికాఫీసు చుట్టూ తిరగడం వల్లనే కద !'

—ఎ రామకృష్ణ
కోరుకొల్లు

పక్క ఫ్లాటులోని యువ దంపతులకి ఆరేళ్ల అబ్బాయి, మూడేళ్ల అమ్మాయి. మా ఇంటికి వచ్చినప్పుడల్లా వాళ్లకి 'పార్లే లాజెన్స్' ఇచ్చేదాన్ని - ఎంతోసంతోషంగా తినేవారు. ఆరెంజ్ కలర్‌లోవున్న కాగితం విప్పుతున్నప్పుడు వారిముఖాలు చూడాలి - ఎంతో ముద్దుగా వుండేవి..... వారికి ఢిల్లీ ట్రాన్స్‌ఫరయింది - ఆరేళ్ల తర్వాత మళ్లీ కలకత్తా వచ్చారు. ఈసారి పక్క ఫ్లాట్‌కాదు - వారికి గవర్నమెంటు క్వార్టర్స్ దొరికాయి.

ఆదంపతులు ఒకరోజు సాయింత్రం మా ఇంటికి తమపిల్లలతో వచ్చారు - దారిలో మాగురించి చెప్పి తీసుకు వచ్చారట. అయితే ఆపిల్లలిద్దరూ మమ్మల్ని గుర్తుపట్టినట్టులేదు. చిన్నప్పటిలా దడదడా మాట్లాడలేదు. ఎవరో కొత్తవాళ్లింటికి వచ్చినట్లు కుదురుగా కూచుని, పెట్టిన టిఫిను నెమ్మదిగా తిన్నారు. తల్లీతండ్రీ మమ్మల్ని జ్ఞాపకం చేసేందుకు ప్రయత్నించారు - పిల్లలు తలలూపారే తప్ప గుర్తువచ్చినట్టు లేదు. ఆమెకి బొట్టు పెట్టి, పళ్లూతాంబూలం యిస్తూ పిల్లల చేతుల్లో పార్లేలాజెన్స్‌లు పెట్టాను. నన్ను ఆనమాలు పట్టినట్లు అన్నా చెల్లెలూ ఒకరినొకరుకళ్లలో పలకరించుకు, చెవులుకొరుక్క, నన్ను చెరో వైపునా చుట్టేసేసరికి నాకళ్లలో నిల్చిన కన్నీటికి ఖరీదెవరు కట్టగలరు ?

—బులుసు శారద
కలకతా-53

జడ్జీగారు విప్లవమూర్తిని, అడుగుతున్నారు ; 'ఏమయ్యా. చంద్ర

మండలంలో స్థిరనివాస మేర్పరుచుకోవాలని వెళ్తున్న వీరి రాకెట్‌ని దయాదాక్షిణ్యాలు లేకుండా కాల్చేయడంలో నీ ఉద్దేశ్యం ఏమిటి ? వారు ఈ భూమండలం వొదిలివెళ్ళి పోతున్నారుగా – కావాలంటే నీవూ వెళ్లవచ్చునే ! నీది క్షమింపరాని నేరం.'

'తమరు అలా సెలవిస్తారని నాకు తెలుసు' – అన్నాడు విప్లవమూర్తి.

'మరైతే అంతదారుణానికి ఎందుకు పూనుకున్నావ్ ?'

'అక్కడకూడా వీరు కులమతాలతో కొత్త పార్టీలు స్థాపించి చల్లటి కాంతినిచ్చే చంద్రమండలాన్ని కలుషితం చేయకూడదనే సదుద్దేశ్యంతో !

—జి రాము
నందిగామ

అప్పగింతల వేళ అత్తమామలు భోరున ఏడుస్తూ, సూర్యారావుతో అన్నారు ; 'పద్దెనిమిదేళ్లు పెంచి పెద్ద జేసి, నీ చేతుల్లో పెడుతున్నాం, నాయనా – మాకడుపుకోత, రేపు నీకు కూతురు కలిగి, నీవు ఆ అమ్మాయిని అత్తవారింటికి పంపుతున్నప్పుడు గాని తెలీదు.'

ఆ మాటలు విన్నమీదట సూర్యారావుకి దుఃఖం ఆగలేదు. అతనూ ఏడవటం మొదలేట్టేసరికి, 'నీవెందుకయ్యా ఏడుస్తావ్ – ఇంకాయిరవై ఏళ్ల టైముంది కద' అన్నాడు పక్కన నిలబడ్డ పెద్దమనిషి సముదాయించే ధోరణిలో.

'అందుకుకాదు.'

'మరింకెందుకు ?'

'పద్దెనిమిదేళ్లు పోషించిన తలిదండ్రులే యింత ఏడుస్తున్నప్పుడు, జీవితాంతం పోషించవలసిన నేను యింకెంత ఏడ్వాలో అని బాధగావుంది' – అన్నాడు సూర్యారావు కళ్లవొత్తుకుంటూ.

ఈ అల్లుడిగారి తెలివికి అందరూ విస్తుపోయారు.

—చామర్తి హనుమంతరావు
చింతలూరు

తినేందుకు యితరులు బతుకుతారు ; కాని, నేను బతికేందుకు మాత్రమే తింటాను.

—సోక్రటీస్

# పాఠకుల లేఖలు

శ్రీ చందూర్‌గారికి :
మైన పాండిత్యంతో విరాజిల్లే త్రివర్ణ ముఖచిత్రములను ఆనాటి 'గృహలక్ష్మి' ప్రచురించింది. అవి జ్ఞాపకం చేస్తున్న మీకు మా ధన్యవాదములు.

—పియల్ నరసింహమూర్తి
మద్రాసు-93

సంపాదకులకు వందనములు. కేసరిగారి 'ముచ్చట్లు' ఎంతో ఆసక్తి కరముగా ఉంటున్నవి. ఎన్నో తెలియని విషయాలను మీ పత్రికలోని వివిధ శీర్షికలు వెల్లడిస్తున్నాయి.

—సి నాగేశ్వర్రావు
సికింద్రాబాదు-3

ప్రియమైన చందూర్ దంపతులకు : నమస్తే. మీ ఉభయులూ చేస్తున్న సారస్వతసేవ గురించి నేను ఎన్నో తడవలు అనుకుంటూ వుంటాను. చవకబారు రచనలకు పోటీయని 'జగతి' అంటే మాయింట్లో అందరికీ యిష్టం.

—డా॥ చెల్వపిళ్ల
కాలిఫోర్నియా

చందూర్‌గారికి : పెద్దలు మాన్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు శ్రీ రాజాలక్ష్మి పురస్కార సందర్భంగా చేసిన ఉపన్యాస సారాంశం చదివాను. వారి ఉపన్యాసాలు చాలా విన్నప్పటికీ, యిదిమాత్రం నన్ను పులకింపజేసింది - గొప్ప ఆశావాది.

—వావిలాల గోపాలకృష్ణయ్య
గుంటూరు-2

శ్రీ చందూర్‌గారికి : నమస్కారములు. 'డైరీ' చాలా బాగుంటున్నది. మద్రాసులో జరిగే ఫంక్షన్సూ, అక్కడి కార్యక్రమాలు రాయడంవల్ల, మద్రాసు వాతావరణం మావంటివారికి కళ్లకు కట్టినట్లు చూపిస్తున్నారు. మీ రచనల్లోను, మీ పత్రికలోను ఒక ఆత్మీయత ఉంది. మద్రాసు నగర ప్రశాంతత, అక్కడి మానసిక పరిపక్వత నాకెంతో నచ్చుతాయి.

—సుంకర రమణి
విశాఖ-17

చందూర్‌గారికి : 'జగతి' ప్రతి నెలా ఎన్నో కొత్తసంగతులు మాకు చెబుతున్నది. తెలుగు చదవటం, రాయటం రాని మా అబ్బాయి, మీ పత్రిక అందగానే తను మొదట తీసుకుంటాడు. ఎందుకురా, అని అడిగితే, రఘు ఈ నెల ఏం ప్రశ్నవేశాడో తెలుసుకోవాలి - అని అంటాడు అభినందనలతో.

—ఆర్ సుజాత
బొంబయి-20

# వెన్నెల కెరటాలు

## మల్లంపల్లి

1940 నుండి 46 వరకు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి నియమనముపై చరిత్ర పరిశోధకులుగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పని చేశారు. ఇంతలో స్వరాజ్యం వచ్చింది. అప్పటి మన రాష్ట్ర ప్రభుత్వంవారు 'తెలుగు భాషాసమితి' ని స్థాపించారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వసంకలనం చేయాలని సంకల్పించి మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని మూడవ సంపుటంగా వెలువడిన "తెలుగు సంస్కృతి" కి ప్రధాన సంగ్రాహకులుగా నియమించారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని దేశానికి అందించాలని ఎంతో ఉత్సాహంతో ఒక ఉద్యమంగా ఆరంభించిన లక్ష్మణరావు, నాగేశ్వర రావు పంతులుగార్ల ఆత్మలకు ఈ కృషిద్వారా శాంతిని చేకూర్చగలిగినా ననే ఆనందం వారి ముఖంలో చిందులాడుతుండేది. 1957లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో శర్మగారిని ప్రాచీనశాసనాలు, నాణెములు గురించి బోధించడానికి ఉపన్యాసకులుగా నియమించారు. ఆంధ్రుల ఆ భాగ్యం వల్ల 1963 జనవరి 7 వ తేదీన శర్మగారు శివసాయుజ్యం పొందారు.

—ఏకాంబరాచార్యులు
'గాంధీక్షేత్రం'లో

## రఘుపతి

'1904 లో రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు కాకినాడ కాలేజీ ప్రిన్సిపాల్‌గా నియుక్తులైరి' అంటూ చిలకమర్తి తన స్వీయచరిత్రలో ఒక చారిత్రక సన్నివేశాన్ని పొందుపరచారు. అప్పటికే ఆయన సంఘ సంస్కరణోద్యమాలలో చురుకుగా పాల్గొంటున్నారు. బ్రహ్మోపాసకులుగా కీర్తిమంతులయ్యారు. బందరులో పని చేస్తున్నకాలంలోనే సర్వశ్రీ ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, గొట్టిపాటి వెంకటసుబ్బయ్య వంటి ప్రఖ్యాతులకు గురువై - వారి మానసిక వికాసానికి దోహదం చేశారు. కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, గుడిపాటి వెంకటచలం, ప్రభృతులెందరిపైననో ప్రభావం కలిగించారు.

—సోమసుందర్
'స్రవంతి'లో

# పాతికేళ్ళ నాటి పిక్చర్

## 'అనాథ వనిత'

దిక్కూ దివాణంలేని మాల్, ఆ పట్నం మేయరు ఇంట్లో పెరుగుతూంటుంది. కొంచెం వయసొచ్చాక, ఆమె వాలుచూపులు మగవారిని మురిపించడం మొదలెడతాయి. ఆశ్రయమిచ్చి పోషిస్తున్న మేయరు సైతం ఆ చూపులు తప్పించుకోలేక పోతాడు. ఇక, ఆయన కొడుకులిద్దరి సంగతి చెప్పనక్కర్లేదు. రెండో అబ్బాయి ఈ మాల్ని పెళ్లి చేసుకుంటాడు. అయితే, అతను చెడ తాగి ప్రయాణం చేస్తూవుండగా ఆ బగ్గీ బోల్తాకొట్టి, అతను మరణిస్తాడు. ఆ తర్వాత మాల్కి మేయరు గారింట్లో నుంచి ఉద్వాసన. చేతిలో చిల్లిగవ్వ లేకపోయినా, గుండె దిటవుతో లండన్ బయలుదేరుతుంది. అక్కడ లేడీ బ్లయిస్టన్కి సహాయకురాలవుతుంది. ప్రేమోపాసన, సాహస కృత్యాలు విషయంలో ఏ మాత్రము వెనకాడకుండా ఎందరో పెద్దమనుషులని చుటూ తిప్పుకుంటూ వుంటుంది. వారి సంపదలో సాధ్యమైనంత చేజిక్కించుకుంటూ, పెళ్లిమాట వచ్చే సరికి మొహం తప్పించేది. ఎంతో నేర్పుగా నెగుకుంటూ వచ్చిన ఈ మాల్, అందగాడైన ఒక చోరుని వెర్రిగా నమ్ముతుంది - అతనామె హృదయ చోరుడవుతాడు. అయితే, అతను ఈమెగారు లేడీ బ్లయిస్టర్గా అపోహపడి తన ప్రణయం వెళ్లబోస్తున్నాడు. పోతే, మాల్ అతనిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తోంది. ఈ చోరుని గర్ల్ఫ్రెండ్ ఒకామె, 'మాల్ని పెళ్లిచేసుకో, డబ్బుబాగా రాబట్టవచ్చు' - అని సలహా యిస్తుంది. ఈ ప్లాన్ విగటిస్తుంది. 'అవారా'లా తిరిగే ఆ చోరుడు, అతని గర్ల్ఫ్రెండూ జైల్లో పడతారు. వారుచేసిన నేరానికి పెద్ద శిక్ష పడవలసివుంది. కాని అనుకోకుండా తనకు సంపద రావడంతో మాల్, వారి జుల్మానా చెల్లించి, ఇద్దరినీ దూరతీరాలకు, అమెరికాకు పంపించేస్తుంది. ఒక అనాథ వనితలోని ఔన్నత్యం ఈ పిక్చర్లో కనిపిస్తుంది. 'ది యమొరస్ యడ్వంచర్స్ ఆఫ్ మాల్' అనే నవల ఈ చిత్రానికి ఆధారం 'టామ్ జోన్స్' మాదిరి యిదికూడా 18వ శతాబ్దపు ఆంగ్లనవలని ఆధారంగా చేసుకు తీసిన చిత్రం. అనాటి పరిస్థితులు, జీవనహేల, ప్రణయ వియోగాలు, వ్యక్తుల నడత, చక్కగా చెప్పే ఈ పిక్చర్కి దర్శకులు: టెరెన్ యంగ్; నిర్మాత: మార్సెల్ హెల్మాన్.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - ఏప్రిల్ 1965

## మానవ ప్రగతి

## 'క్లియో' అవార్డు

మద్రాసు మహానగరానికి ఇటీవల ఒక సాయంకాలం ప్రపంచంలోని మరో నాలుగు మహానగరాలతో ఒక గంటసేపు దృశ్య, శ్రవణ సంబంధాలు ఏర్పడ్డాయి. ఇక్కడ అమెరికా సమాచార విభాగం (యు ఎస్ ఐ ఎస్) ఉపగ్రహం ద్వారా నిర్వహించిన 'వరల్డ్ నెట్' చర్చా కార్యక్రమం క్రింద "1989 క్లియో అవార్డులు - అడ్వర్టయిజింగ్ కళ" అనే అంశంపై వాషింగ్టన్‌లోని 'క్లియో' అధ్యక్షునితో మద్రాసు, టెల్ అవీవ్ (ఇజ్రాయెల్), ది హేగ్ (నెదర్లాండ్స్), ఇజ్మీర్ (టర్కీ)లలోని నిపుణులు సంభాషించారు. ఈ ఆసక్తికరమైన కార్యక్రమంలో అమెరికానుంచి మాట్లాడుతున్న 'క్లియో' అధ్యక్షుడు, మద్రాసులోని అమెరికన్ సెంటర్ ఆడిటోరియంలో టెలివిజన్ తెరపై కనిపించగా; మద్రాసు నుంచి ఇంకా ప్రపంచంలోని మరో మూడు నగరాల నుంచి నిపుణులు వేసిన ప్రశ్నలు టెలిఫోన్ లైన్ల ద్వారా వాషింగ్టన్‌లోని 'క్లియో' అధ్యక్షునికి చేరాయి. ఈ 'వరల్డ్‌నెట్' చర్చలో మద్రాసు నుంచి ఆర్కె స్వామి (ఆర్.కె. స్వామి అడ్వర్టయిజింగ్ అసోసియేట్స్ ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్). మోహన్ మీనన్ (ఒగిల్వీ అండ్ మాథర్ లిమిటెడ్ ఉపాధ్యక్షుడు); ఎస్ రామచందర్ (ముద్రా కమ్యూనికేషన్ ప్రయివేట్ లిమిటెడ్ ఉపాధ్యక్షుడు) వాషింగ్టన్ లోని 'క్లియో' అధ్యక్షునితో మాట్లాడారు. 'కమర్షియల్ అడ్వర్టయిజింగ్' అనే అంశంపై ప్రధానంగా చర్చించిన ఈ కార్యక్రమంలో 1989 వ సంవత్సరానికి క్లియో అవార్డులను పొందిన కొన్ని 'అడ్వర్టయిజింగ్' చలనచిత్రాలను కూడా టెలివిజన్ తెరపై మధ్యమధ్యన ప్రదర్శించారు. ప్రపంచం మొత్తం మీద అత్యుత్తమమైన 'అడ్వర్టయిజింగ్' చిత్రాలకిచ్చే బహుమతులన్నిటిలోకి అతివిశిష్టమైన బహుమతిగా పేరు పొందిన 'క్లియో' అవార్డును 30 ఏళ్లగా అర్హమైన చిత్రాలకు అందజేస్తున్నారు. 1989లో ఈ అవార్డు కోసం 70 దేశాలనుంచి 27,000 చిత్రాలు పోటీపడ్డాయి. దీనితో ఇప్పుడే, 'క్లియో' అవార్డుల కార్యక్రమం

ప్రపంచంలోని అతిపెద్ద 'అడ్వర్టయిజింగ్, అవార్డుల కార్యక్రమంగా కూడా విశిష్టస్థానం పొందింది. కాగా ఈ అవార్డులపైన, 'క్లియో అవార్డు'ల అధ్యక్షుడు బిల్ ఎవాన్స్ ఆసక్తికరమైన సమాధానాలిచ్చారు. ఈ కార్యక్రమాన్ని అమెరికన్ సెంటర్ ఆడిటోరియంలో క్రిక్కిరిసిన ప్రేక్షకులు ఎంతో ఆసక్తితో తిలకించారు.

## సిగరెట్టు మానేందుకు

ఫ్లోరిడాలో స్థిరపడిన ఒక భారతీయ సంతతి వైద్యుడు ధూమపాన ప్రియులతో సిగరెట్లు మాన్పించగల ఒక క్రొత్త గుళికను తయారుచేశారు. ఈ మందు బిళ్లను మ్రింగితే పొగత్రాగే వారు ఎట్టి మానసిక ప్రతిఘటనకు గురి కాకుండానే సిగరెట్లుకు స్వస్తి చెబుతారట. 'నిక్-ఫిట్' అనే ఈగుళిక నెలరోజులలో సిగరెట్లకు దూరంచేస్తుందని డాక్టర్ అబ్దుల్లార్ ఫతే చెప్పారు. 60 నుంచి 80 శాతం వరకు విజయవంతమైనదట. 'నిక్-ఫిట్' విజయ రహస్యం దానిరుచిలో వున్నదని ఎంచక్కా తియ్యని కలకండను నమిలినట్లుగా నమల వచ్చునని, పిప్పరమెంటు రుచి గల ఈబిళ్ల సిగరెట్లు కాల్చాలనే కోరికను తగ్గించడంతోపాటు శ్వాసను తాజాగా వుంచుతుందని అంటున్నారు. ఈమందుని డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేకుండానే కొనుగోలు చేయవచ్చు. 'నిక్-ఫిట్' గుళికలను ఆరువారాల పాటు వినియోగించడానికి 40 డాలర్లు (సుమారు 640 రూపాయలు) ఖర్చవుతుంది. 'నిక్-ఫిట్ కార్పొరేషన్' ఒక 'కుటుంబసంస్థ' అనవచ్చు. బొంబాయిలో జన్మించిన డాక్టర్ ఫతే దీనికి చీఫ్ ఎగ్జిక్యూటివ్ కాగా, ఆయన భార్య అకౌంటెంట్ గా పనిచేస్తున్నారు. ఆయన కుమారుడు డాక్టర్ కాగా, ఇద్దరు కుమార్తెలు వైద్యవిద్యను అభ్యసిస్తున్నారు. తమ ముగ్గురు పిల్లలు, ప్రత్యేకించి తమ కుమారుడు ఈగుళిక ఉత్పాదనలో తలమునకలై వున్నారట. 'నిక్-ఫిట్' గుళికకు ఈ మధ్యనే అమెరికా ఆరోగ్య, ఔషధ విషయాల పాలనా యంత్రాంగం ఆమోదం లభించింది.

## తమలపాకు

భారతదేశంలో పదహారు తెగల కుటుంబములు, తమలపాకుల సేద్యంపై కాలం గడుపుతున్నారు. తమలపాకుల ఉత్పత్తి రు.800 కోట్లకుపైగా వున్నది. పశ్చిమ బెంగాల్ లో ఐదు లక్షలమంది ప్రజలు తమలపాకుల పెంపకంపై జీవించుచున్నారు. తమలపాకుల పెంపకం చాల ఖరీదైనది. ఒక తమలపాకుతీగ పెంచడానికి కావలసిన భూమి అంతా కలిపితే, రు.7000 సుమారుగా ఖర్చు అవుతుంది. మామూలుగా, తమలపాకుల పెంపకం మార్చి నెలలో వేస్తారు. జూన్ నెలలో, ఆకులు కాపుకి వస్తాయి. పశ్చిమ బెంగాల్ లోని మిధనాపూర్, నాదియా, హౌరా, హుగ్లీ, 24 పరగణజిల్లాలు, తమలపాకుల పెంపకంలో పేరు పొందినవి. ✵

# కొత్త పుస్తకాలు

ఈ నెల ఈ శీర్షికలో పుస్తకాలు గాక మాకు అందే కొన్ని చిన్న పత్రికలను పరిచయం చేదామనుకుంటున్నాము. మాది చిన్నపత్రిక అవటంవల్ల, చిన్నపత్రికలంటే అభిమాన మెక్కువ. ఈ చిన్నవాటిలో మొదట పేర్కొనవలసినది 'మంజువాణి'. ఏభై సంవత్సరాలుగానో, అంతకుమించో, ఏలూరు నుంచి వెలువడుతున్న ఈ ఆంగ్ల తెలుగు వారపత్రిక, కోర్టు ప్రకటనల పత్రిక అని ఒకప్పుడు అనిపించుకున్నప్పటికీ, అడ్వకేట్ కె రామచంద్రరావు ఆర్టికల్స్, తెలుగు మేధావి వర్గంలో ఈ పత్రికకు ఒక ప్రత్యేక స్థానం కలిగిస్తున్నాయి. జంకు గొంకులు లేకుండా, నిర్భయంగా విషయ వివరణ గావించే పదునైన కలమాయనిది. పది పన్నెండేళ్ల క్రితం సిడి దేశ్‌ముఖ్ మాతో స్వయంగా అన్నారు : 'ఒక్క ఇష్యుకూడా మిస్ కాకుండా నేను చదివే పత్రిక 'మంజువాణి' ఒక్కటే' - అని ! దేశ్‌ముఖ్ వంటి సర్వతోముఖ. ప్రతిభావంతుని మన్నన పొందిన ఈ 'మంజువాణి' కాపీ వెల తొమ్మిదిపైసలు, పోస్టేజి గాక ! సంవత్సరచందా నాలుగు రూపాయలు. జాతీయ అంతర్జాతీయ విషయాలను పండువొలిచి పెట్టినట్లుగా చెప్పే ఈ పత్రికకు మూలస్థంభం అడ్వకేట్ కె రామచంద్రరావు. ('మంజువాణి' - సంపాదకులు : యన్వి చలపతిరావు, మంజువాణి హౌస్, ఏలూరు - 1)

✠ ✠ ✠

'సెక్యూర్' (SECURE) అనేది హైదరాబాదులోని 'సెక్యూరిటీ ప్రింటింగ్ ప్రెస్' వారి హౌస్ మాగజైన్ - అనగా ఆ సంస్థలోని ఉద్యోగులకు మాత్రమే పరిమితమైనది. మూడు నెలలకొకసారి వచ్చే ఈ క్వార్టర్లీలో ఇంగ్లీషు, తెలుగు, హిందీ, ఉర్దూ విభాగాలు వుంటాయి. కథలూ, కవితలూ, కార్టూనులూ దేశభాషా విభాగాల్లో ఉన్నప్పటికీ, ఇంగ్లీషులోని ఆర్టికల్స్ మాత్రం ఉన్నత ప్రమాణానికి చెందివుంటాయి. లేటెస్ట్ ఇష్యులో 'ఫిజికల్ ఫిట్‌నెస్' గురించి సచిత్రంగా చెప్పినది ఎంతో బావుంది. ఈ పత్రికలోని కథలూ, కవితలూ సామాన్య వీక్లీ రచనలకు ఏ విధంగానూ తీసిపోవు సరిగదా ఒక మెట్టు పైన వుంటాయి. ఇది సభ్యులకు మాత్రమే (సెక్యూరిటీ

క్వార్టర్లీ, సంపాదకులు : యమ్మెల్ నారాయణ, సెక్యూరిటీ ప్రింటింగ్ ప్రెస్, హైదరాబాదు).

✠ ✠ ✠

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ వారి హౌస్ జర్నల్ పేరు పెప్ న్యూస్ (Pep News). ఇది నెలకొకసారి వెలువడుతుంది. 'భెల్'కి (BHEL) సంబంధించిన ఉత్పత్తి కార్యక్రమాలు, విస్తరణ అంశాలు, సంక్షేమ విశేషాలు, జరుపుకున్న పండగలు పబ్బాలు, కార్పొరేట్ న్యూస్, కన్వెన్షన్స్, సెలిబ్రేషన్స్, వెల్ఫేర్ సెంటర్స్, ట్రాన్స్ఫర్లు, రిటైరుమెంట్లూ - ఈ భారీ సంస్థకు సంబంధించిన సమాచారం యావత్తూ యిందులో ఉంటుంది. మన ప్రభుత్వ యాజమాన్య సంస్థలు ఒక విధంగా విస్తృత కుటుంబాలు. ఉత్పత్తులకు సంబంధించిన అంకెలతో బాటు, వనితలకు బ్యూటీ పార్లర్, నిరాశ్రయులైన స్త్రీల స్వయం ఉపాధిగా వెట్ గ్రయిండింగ్, టైపింగ్ ఇన్స్టిట్యూట్, కల్చరల్ యాక్టివిటీస్ - ఇటువంటివన్నీ తెలిపే మాసపత్రిక (Pep News, Public Relations Divison of BHEL, Ramachandrapuram, Hyderabad - For Private Circulation)

✠ ✠ ✠

'లేపాక్షి' - సేలం స్టీల్ టౌన్షిప్ లోని తెలుగు అసోసియేషన్ వారి నాలవ వార్షికోత్సవ సంచిక, జవహర్ లాల్ నెహ్రూ శతజయంతి స్మారక సంచిక.... ఎన్నో రంగుల తెల్లకిరణం గురించి 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి ప్రాయగా, 'కథ కాని కథ' గురించి చెబుతారు లావణ్యా రామలింగం.... నెహ్రూ సంచికలో గోపాలన్, జి ఆర్ కె మూర్తి ఆ మహాపురుషుని మనోగతులను ఎంతో చక్కగా వివరించారు. విజయకుమారి రచించిన 'బైరాగి సంసారం' ఒక హాస్యనాటిక. ఇదే సంచికలో పప్పు వేణుగోపాలరావు సారంగపాణి పదముల గురించి చెప్పారు. వార్షికోత్సవంతో బాటు ప్రతిఏటా వెలువడుతుంది 'లేపాక్షి'. (సెక్రటరీ : లేపాక్షి తెలుగు అసోషియేషన్, మోహన్నగర్ - సేలమ్ స్టీల్ ప్లాంట్ టౌన్షిప్, సేలమ్ - 636 030).

✠ ✠ ✠

'Heads and Tails' - శ్రీకాళహస్తినుంచి వెలువడుతున్న ఇంగ్లీషు క్వార్టర్లీ.... 'గ్రీకువస్తాదు కుండే కండ పుష్టి, మెకెవెల్లికిగల నక్కజిత్తులు, సోలమన్కి వున్న విజ్డమ్, సింహానికి గల సాహసం - వీటన్నిటితోబాటు మేకకుగల జీర్ణశక్తి వున్నవాడే వైస్ - ఛాన్సలర్గా నెగ్గుకు రాగలడు' అని ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ రామిరెడ్డి, హెర్మాన్ వెల్స్‌ని కోట్ చేస్తూ అన్నారట.... "జూదవ్యసనం ధర్మరాజుకే, నలునికే కాదు, షేక్స్పియర్ నాటకంలోని మూడవ రిచర్డ్ 'మై కింగ్‌డమ్ ఫర్ ఎ హార్స్' ('My Kingdom for a Horse') అంటాడు. మాంటికార్లో భాగ్యవంతుల జూదశాల కాదా ?" - అని ప్రశ్నించారు 1951

నాటి 'ఇండియన్ రిపబ్లిక్'లో తిరుపతి రావు. యన్నెస్ రామస్వామి జాతీయ సమైక్యతకు సంబంధించిన చక్కటి సూచనలు చేశారు. భాష కారణంగా (బెంగాలీ - ఉర్దు) పాకిస్థాన్ మనకళ్ల ముందు రెండుముక్కలుగా చీలింది; కులమతాల కంటె భాషాబంధం పటుతరమైనది అంటారాయన. డి ఆంజనేయులు, ఎ రంగనాథన్, నరసింహన్, బెట్టిపాల్ మున్నగు వారి రచనలు వున్నాయి (Heads and Tails, Editor; DVS Tirupati Rao, Srinivas, Sri Ram Nagar, Srikalahasti - 517 644. Price per Copy : Rs 4-00).

తెలుగువాణి, గాంధీక్షేత్రం, నాస్తిక మార్గం, స్త్రీ స్వేచ్ఛ, శాంతి, ఆయుర్వేద – యిలా చాలా వున్నాయి. వాటి ప్రస్తావన మరోసారి ఎప్పుడైనా.

—క్షీరసాగరమ్

ఈమధ్య అందినవి :

శ్రీ చక్రనవావరణ పూజా విధానము. పద్మశ్రీ స్వామిప్రణవానంద. ఆంధ్రకళాపరిషత్తు, హైదరాబాదు. రు 3-00.

శ్రీమద్భాగవత రహస్య మాహాత్మ్యములు. పురాణపండ రాధాకృష్ణ మూర్తి, రాజమండ్రి - 4.... రు 5-00.

(The Dreams of a Poetess and other Poems by late Dr. B. Ramakrishna Rao, B. Ranganath Rao, Hyderabad - 500 027... Rs. 5-00)

సత్యవతి కథలు. అరుణా బుక్ హవుస్, విజయవాడ – 2.... రు 15-00,

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి. —

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా పలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుత అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



'నేను వంగవోలు తాలూకాలో, ఆ పట్నానికి సమీపముగా ఉండే ఇన మనమెళ్లూరు గ్రామంలో, ఒక పేద కుటుంబమునందు, పూరిఇంట్లో జన్మించినాను. మా యింటి పేరు కోటవారు. మేము వెలనాటి వైదికబ్రాహ్మణులము. నేను జన్మించిన 3 మాసములకే హఠాత్తుగా మా తండ్రి కలరా జాడ్యమువల్ల స్వర్గస్థుడైనాడు. మా నాయన గారు చనిపోవునప్పుడు, ఆయన జంధ్యాలు వడుక్కుంటూ వచ్చిన టెంకాయ చిప్పలో పది అణాలు రొఖ్ఖం మాత్రం నిలువ చేసి వెళ్ళిపోయినారు. అదీ నా పిత్రార్జితము. ఆ పిదప మా తల్లి ఎన్నెన్ని కష్టములో పడి 10, 11 సం॥ లు పెంచి పెద్దవానిని చేసింది. ఆమె కష్టము చూడలేక, కాలినడకని, దారి మకాములు చేసుకుంటూ చెన్నపట్నం చేరుకున్నాను'— అంటారు, కేసరీకుటీర, కేసరీవిద్యాలయ, గృహలక్ష్మి వ్యవస్థాపకులైన కేసరిగారు .... పదో భాగం చదవండి.

కొంకణ బ్రాహ్మణులుకూడా ఆర్యావర్తమునుండి పరశురాముడు పిలుచు కొని రాగావచ్చిన వారు అని స్కాందపురాణమున సహ్యాద్రికాండ యందు చెప్పబడియున్నది. ఈ కొంకణ దేశముకూడ పరశురాముడు సముద్రము నుండి యుద్ధరించిన సప్తరాష్ట్రములలో నొక్కటియట.

నంబూదిరీ బ్రాహ్మణుల నివాసమగు ఆ క్రొత్తదేశమును పరశురాము డుద్ధరించెను గావున 'పరశురామక్షేత్రము' అందురు. కొండప్రదేశమగుట 'మళయాళము' అంటారు. నారికేళముల యుత్పత్తి విస్తారమగుటచే - 'కేరళము' అందురు. భూమి పుట్టగానే తొలుతగా కొనిరాబడిన అగ్రజాతి ఆర్యులు నాగరిక మొనర్చిన దేశము కావునను, ఆ ఆర్యులు ఆ కాలము నుండియు, వైదికకాల సాంప్రదాయము ననుసరించి యజ్ఞ యాగాదిక్రతువులు, షోడశకర్మలు ప్రధానముగా తలంచి నిర్వహించు కర్మిష్ఠులగుట చేత "కర్మ భూమి" అనియు అందురు. ఇక నీ అగ్రజాతులగు నంబూదిరీ బ్రాహ్మణుల ఆచార వ్యవహారములగూర్చి వివరింతును.

## నంబూదిరీల ఆచారవ్యవహారములు

వీరు వేదవేదాంగవేత్తలు ; మహాకర్మిష్ఠులు, మంత్ర శాస్త్రనిధులు, శిష్టా చార సంపన్నులు, వైదికాచారకర్మ పరాయణులై వీరు, సామాన్యముగా ఇల్లు వదలి పైకి రారు. ఇతర కులముల స్పర్శ వీరికే మాత్రము పనికిరాదు. పూర్వము వీరిలో ఉద్యోగములకు వచ్చువారు లేరు. ఇప్పుడిప్పుడు వీరును ఇంగ్లీషు చదువులు చదివి ఉద్యోగములకు వచ్చుచున్నారు.

వీరట్టి యోగ్యులుకావున వీరికి "నంబూదిరీలు" అనే పేరు వచ్చినది. "నంబుక" అనగా విశ్వాసము. దానినే మనము తెనుగున "నమ్మిక" అందుము. అట్లు విశ్వసింపదగినవారుగాన వీరు "నంబూదిరీలు" అని పిలువబడినారు. "తిరి" అనేది గౌరవవాచకము. బహుశా "శ్రీ" యే "తిరి" అయినదేమో !

వీరు మొట్టమొదట అరణ్యప్రదేశమున నాగుపాముల బాధకు తాళవలసి వచ్చెను. అయితే వారు పండితులగుటచేత, మంత్ర తంత్ర ఆరాధనలచే నాగు లను స్వాధీనమొనర్చుకొనిరి. నేటికిని అక్కడ నాగపూజ విస్తారము. ఆ నాగ భక్తి చిహ్నమే - వారు - నాగుపాము పడగవలె జుట్టుముడి నడినెత్తిన ముడిచి ముందుకు విడుచుట.

వీరు వచ్చిన తొలిరోజులలో అక్కడ యిండ్లుగాని ఇతర వసతులుగాని లేవు. ఇటుక వగైరా లింకను ఏర్పడలేదు. అందుచేత నా తొల్లింట నివాసులు అడవికొట్టి కలపతో చిన్న యిండ్లు కట్టుకొనేవారు. నేటికి ఆ ఆచారము పోకుండ కేవలము కలపతోనే నిరాడంబరమగు కుటీరములను గ్రామాదులలో నిర్మించుకొని ప్రకృతిశోభ ననుభవించుచు నంబూదిరీ బ్రాహ్మణులు నివసించు చున్నారు.

వీరు తొలుదొల్తగా భూమికి వచ్చినప్పుడు ఇది నిర్జనప్రదేశమగుట వలన, ఆర్యుల నాగరికత ననుసరించి వీరైనంత భూమి నాక్రమించి, సస్యములు, వృక్షజాతములు వృద్ధిచేసుకొనుచు అనుభవించిరి. ఆ భూములు వారి స్వంత మైనవి. నమ్మిక కలవారగుట, ఆచార సంపన్నులగుట, బ్రాహ్మణులగుట, పిదప రాజులు భక్తిపూర్వకముగ విస్తారముగ భూములను వీరికి దానమొసంగిరి. ఇట్టి భూముల ననుభవించు వీరిని "జన్మీలు" అందురు - అనగా జమీందారులు (భూస్వాములు) అని అర్థము. ఈ విధముగా నేటికిని సగమునకు పైగా కేరళ మున భూమి, జన్మీలగు నంబూదిరీల ఆధీనమునను న్నది. వాని ననుభవించుచు వారు పూర్వాచార పరాయణులై హాయిగా బ్రతుకుచున్నారు.

మా యింట నంబూదిరీ బ్రాహ్మణుడొకడు కొంత కాలముగ వంటచేయు చున్నాడు. నంబూదిరీలలో వంటచేయువారు అరుదుగా నుందురు. అయితే కొచ్చి రాజుల ఇండ్లలో నంబూదిరీలే వంటచేయుదురు. గనుక నా స్నేహితులు, కొచ్చి రాజకుమారులలో నొకరునగు శ్రీ రాజా రవివర్మగారు, వారింట వంట జేయు శంకర నంబూదిరీని మాయింట వంటచేయుటకు పంపిరి. ఈ శంకరుడు మాయింటికి వచ్చిన నాటినుండి నాయందు భక్తివిశ్వాసములుగల్గి పితృభక్తితో నన్ను సేవించుచున్నాడు. ఇతను చదువరి. ఆచారవంతుడు. ప్రాతఃకాలమున చన్నీళ్ల స్నానమొనర్చును. తెల్లవారి స్నానముచేసిగాని నాకు కాఫీపెట్టి యివ్వడు. ఈ వంట వానిని నేను 'తిరుమేని' అని పిలువవలయును. అనగా 'శ్రీశాస్త్రిగారూ' అనే పిలుపు వంటిది. ఈ తిరుమేని చాలనెమ్మతి వాడగుటచే వాని నప్పుడప్పుడు చనువుగ దగ్గరకు పిలిచి కూర్చుండబెట్టుకొని వార్లకులా చారములను తెలుసుకొనుచుందును. ఇక్కడ నేను వ్రాసిన నంబూదిరీ బ్రాహ్మణుల ఆచారములన్నియు చాలవరకు మా వంటవానివల్ల తెలిసినవే.

విధివిహితమగు షోడశకర్మలలో జాతకర్మ మొదటిది. బిడ్డపుట్టిన 36 గం॥ల లోపున బిడ్డతండ్రి బిడ్డ ముఖారవిందమును చూచును. అంతట నాతడు స్నానముచేసి వచ్చి బిడ్డను వడిలో కూర్చుండబెట్టుకొని జాతకర్మ మొనర్చును. అప్పుడే అతడు శిశువు దీర్ఘాయువునకై యోగ క్షేమములకై దాన

ధర్మము లొనర్చును. నేతిని, తేనెను కొద్దిగా కొద్దిగా తీసికొని కలిపి దానికి కొంచెము బంగారమును చేర్చి, అదృష్టచిహ్నముగా దానిని బంగారు కడ్డీతో కలియబెట్టి ఒక బంగారు పాత్రతో బిడ్డ గొంతులో పోయును. ఆ కార్య మొనర్చుచు కొన్ని ఋగ్వేద మంత్రముల నతడు వల్లించును. ఆ విధముగా నది జరుగనిచో పురుడు వెళ్లువరకు జరుగుటకు వీలులేదు. పురుడు మన దేశములో వలెనే 10 రోజులుపట్టుదురు. 11 వ రోజున బాలింత శుద్ధి స్నాన మొనర్చును.

పిదప కర్మ నామకరణము. మనవలె 11 వ రోజునగాక 12 వ రోజున జరుపబడును. తండ్రియే బిడ్డను వడిలో కూర్చుండబెట్టుకొని, మంత్రపూతముగా విసర్గాంతమగు నామధేయమును సంస్కృతమున బిడ్డ చెవిలో ఉచ్చరించును. తండ్రి పిదప తల్లియు అట్లే ఆ నామధేయమును శిశువు చెవిలో చెప్పును. 13 వ రోజున నామకరణమొనర్చుట వారికి శుభస్కరము కాదట.

బిడ్డకు నాలుగవ మాసము వచ్చువరకు బాహ్య ప్రదేశమునకు బిడ్డను తేరు. అప్పుడు 'నిష్క్రమణము' అని యొక కర్మ జరుపబడుచున్నది. ఇందుకు గాను పనస చెట్టు నొకదాని నలంకరింతురు. బిడ్డ నప్పుడారుబయటకి తెచ్చి బిడ్డ కాలితో ఆ పనస చెట్టు వేరు త్రొక్కింతురు. మామూలుగా బ్రాహ్మణులకు దానధర్మము లొనర్తురు.

శిశువు దినదినాభివృద్ధి నందుచుండగా ఆరవనెలయందే అన్నప్రాశనము జరుగును. శుభముహూర్తమున అన్నమును, తేనె, నేయి, చక్కెరలతో చేర్చి శిశువుచే తినిపించుదురు. ఈ అన్నప్రాశన సమయమున అశ్వలాయన గృహ్యా సూత్రానుసారముగ మంత్రములు చదువబడును. అన్నప్రాశనకు 5, 7 నెలలు మంచివికావు.

పిదప జరుగు కర్మ చౌళము - అనగా ప్రథమముగా కేశఖండనము. మనదేశమున బాలురకే ఈమహోత్సవము జరుపబడును. ఆ దేశమున బాలిక లకును జరుపుదురు. అది వారికి అశుభము కాదు. సామాన్యముగ నిది 3 వ సం॥ ననో, 5 వ సం॥ ననో జరుపబడును. ఒక్కొక్కప్పుడు బాలుర కైదవ ఏటను బాలికల కేడవ ఏటను జరుపబడుట కలదు. బాలురకు శిఖ విడిచి తల యంతయు గొరుగబడును. బాలికలకు ఒకటి రెండు వెంట్రుకలు మాత్రము లాంఛనముగ తీసివేయుదురు. పూర్తిగ తీసివేయుటయు తప్పు కాదు. అయితే పూర్తిగ క్షౌరము చేసినప్పుడు మాత్రము వడినెత్తిన కోలగా వలయాకారమున కొంతమేర వదలివేయుదురు. ఈ కార్యమును సామాన్యముగ 'మరాన్' అను

శూద్రుడు చేయును. ఇతడు దేవాలయముల పనులు చేయు జాతివాడు. ఈ కర్మ జరుగునపుడు అశ్వలాయన సూత్రానుసారము బిడ్డను అగ్నిహోత్రమునకు పడమరగా తల్లి వడిలో కూర్చుండబెట్టుకొనును. తండ్రి తల్లికి దక్షిణముగా కూర్చుండి 21 దర్భపోచలు చేతబట్టి బిడ్డ తలపై మంత్రపూర్వకముగ జలమును చిలకరించును.

ఆ తరువాత కర్ణవేధము - అనగా చెవులు కుట్టుటకూడా - 3 వ ఏటనో 5 వ ఏటనో జరుగును. ఇదియును మంత్రపూర్వకమే. ఈ పని గావించుటకు ముందు బాలునికి చక్కగా భోజనము పెట్టుదురు.

అట్లే, మూడవ సం॥ న గాని, 5వ సం॥న గాని అక్షరాభ్యాసమగును. ఇందుకు సామాన్యముగా విజయదశమినే శుభముహూర్తముగా నిర్ణయింతురు. గణపతి పూజాదికములైన పిదప బాలునికి తండ్రియో, పోషకుడో, బంగారపు టుంగరముతో 'ఓం' కారమును నాలుకపై వ్రాసి చెవిలో నుచ్చరించును. పిల్లవాని వుంగరపు వ్రేలుపట్టి బియ్యములో 52 అక్షరములు చెప్పుచు వ్రాయించును. కాని మున్ముందుగా మనము "ఓం నమఃశివాయ నమః" అన్నట్లే - వారు "ఓం హరి శ్రీగణపతయే నమః" యనచెప్పింతురు. బాలుడు బుద్ధి విశారదుడగుటకై మంత్రపూర్వకముగ వెన్న తినిపింతురు. పూర్వము చోళ దేశము నుండి మళయాళమునకువెళ్లిన ఉద్దండశాస్త్రి పాండిత్యవిశేషముచే సాలుసాలున రాజిచ్చు పండితబహుమానము పొందుచుండెనట. అంతట నంబూదిరీలందరుకలిసి యొక ఉత్తమగృహస్థుని నిర్ణయించి ఆ దంపతులకు జపతపములతో మంత్రపూతమైన ఆహారమును సంవత్సరము రోజులు దీక్షతో నిచ్చెడివారు. కన్నకుమారునికి అట్లే మంత్రపూతమైన ఆహారమిచ్చుచురాగా నతడు 12వ ఏట ఉద్దండశాస్త్రిని పాండిత్యాతిశయముచే ఓడించివేసెనట. కావున మంత్ర ప్రభావమున బుద్ధి వికసించునని వారి విశ్వాసము.

గర్భాష్టమియందుగాని, అష్టమవర్షమందుగాని ఉపనయనము జరుపబడును. ఉపనయన విధి చాలావరకు మనదేశమునందు వలెనే జరుగును; కాని యజ్ఞోపవీత ధారణానంతరము మనపురోహితులు బ్రహ్మచర్యవిధులు - గ్రుక్కత్రిప్పకుండ సంస్కృతమున ఏకరువు పెట్టుదురు. వారు అట్లుగాదు; సంస్కృతమున చెప్పినదానిని బాలున కన్వయ మగుటకు మళయాళ భాషలో కూడ చెప్పుదురు. ఏలననగా మన బాలుడు మరునాడే తిరిగి హైస్కూలుకో కాలేజీకో పరుగెత్తును. నంబూదిరీబ్రాహ్మణ బాలుడట్లుగాక నిజముగ గురువు వద్దనే చేరి, బ్రహ్మచర్యవిధుల నాచరించుచు అధ్యయనమొనర్చును. సమగ్ర

ముగ గురువు వద్ద వేదవేదాంగములను నేర్చిన పిదప సమవర్తన కర్మ నా చరించి ఇంటికి మరలును. ఈ ఆచారమింకను అచ్చట ఏన్నో ఉత్తమ నంబూదిరీ కుటుంబముల నవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వీరిలో పెద్దవాడొక్కడే స్వకులమున వివాహమాడును. సోదరులందరును అక్కడ అగ్రజాతిశూద్రులైన నాయర్ స్త్రీలను వివాహమాడుదురు. ఈ ఆచారము ఎట్లువచ్చిన దనుదానిని గూర్చి పలుగాథలున్నవి. ఈ నంబూదిరీలు తొలత వచ్చినప్పుడు వీరితోకూడా కొలదిమంది స్త్రీలే వచ్చిరట. పురుష లందరికి చాలినంతమంది స్త్రీలులేరు - పెద్దవాడుమాత్రము స్వకులమున వివాహమాడుటయు, మిగతావారు పరిచారికలైన శూద్రస్త్రీలను వివాహ మాడుటయు ఏర్పడిన దందురు. ఈ శూద్రులైన నాయరుల పుట్టుపుర్వోత్త రములేమి, వీరి ఆచార వ్యవహారములేమి యనునది పిదప వ్రాయుదును, ఇక్కడ నంబూదిరీలను గూర్చియే వ్రాయుచున్నాను.

జమిందారులగు నంబూదిరీలు వారి ఆస్థి వీలిపోకుండా ఏకముగా నుండు టకై ఆచారము నేర్పరచుకొనిరని కొందరందురు, మొదట ఎట్లుఏర్పడినను - ఇప్పుడు నంబూదిరీ స్త్రీలును విస్తారముగ నేయున్నారు. కాని పెద్దవాడొక్కడే వివాహమాడవచ్చునని యున్నది. కావున తగినంతమంది పెండ్లికొడుకులులేక చాలామందిస్త్రీలు అవివాహితులై యుందురు. ఆడపిల్లలతండ్రులు వేలాది కట్నమిచ్చి పెండ్లికొడుకులు లభ్యపరుచుకొందురు. ఈ కట్నములను తప్పించు కొనుటకై ఒక్కనికే పలువురుస్త్రీలను కట్టిపెట్టుటయు కలదు. అయినను పలు వురు ఆ జన్మాంతము అవివాహితులుగానే యుండిపోవుదురు. పెద్దవాడు తనకిక పురుషసంతతి దుర్లభమనితోచిన, ఇంకను వివాహమాడుటకు తరుణము తప్పిన, తన తమ్మునికి కులస్త్రీని వివాహమాడ ననుమతి నిచ్చునట. అప్పుడు కట్నములేకయే లభ్యమైన అతనికి పిల్లనిత్తురు.

నంబూదిరీలలో బహు భార్యాత్వమున్నదేగాని బహుభర్తృత్వములేదు. వితంతు వివాహమును లేదు. రజస్వలాత్పూర్వమే వివాహమాడవలయునని నిర్బంధమును లేదు. రజస్వలానంతర వివాహములే కడుసామాన్యము.

## వివాహక్రమము

వరుని వీరు మనవాళన్ అని పిలుతురు. ఈమనవాళన్‌ను స్వకులములో ఉత్తమునిగా చూతురు ; సమీపరక్తబంధువులు వివాహమాడరాదు. ఉత్తము డనగా వేదవేదాంగముల నభ్యసించినవాడు, సదాచారసంపన్నుడు, ధన

వంతుడు. అంతేగాని మన దేశమునవలె ఇంగ్లీషు చదువువారికి లెక్కలేదు అచ్చట కుమారులలో పెద్దవాడే వివాహయోగ్యుడు కావున ఆడపిల్లలకు వరుడ దొరుకుటయే కష్టము. అందుచే నంబూదిరీలలో వరాన్వేషణమేగాని వధువన్వేషించుట యెరుగరు. తగిన వరుడు దొరుకగనే వధూవరుల జాతకమును జ్యోతిష్కున కప్పగింతురు. అక్కడ జ్యోతిష్కులు ప్రత్యేకకులము. జాతకములు సరిపడినప్పుడు వరునితండ్రి సమ్మతి రురుదురు. నంబూదిరీయొక్క వంశ మర్యాద, కులీనత, ధనాధిక్యతలనుపట్టి కట్నము నిర్ణయము; ఈకట్నము వేలువేలు.

వివాహవిధులు చాలవరకు మనకువలెనే జరుగుతున్నవి. అయినను కొన్ని వింత దేశాచారములు కలవు. పెండ్లికొడుకు బంధుమిత్రులతోకలసి పెండ్లికి తరలివెళ్లును. అతనితోకూడ అతనిని తమ ఏలికగా తలంచు కొందరు నాయర్లు - కత్తులు, కఠార్లు త్రిప్పుకొనుచు వత్తురు. నంబూదిరీ స్త్రీలు ఘోషా నాచరింతురు. పరపురుషులకంట బడరు-కావున వారెవ్వరును పెండ్లికొడుకుతో రారు. పెండ్లికూతురు ఇంటివద్దకూడ ఇంటివారైన నంబూదిరీ స్త్రీలను పైకారణముచేతనే వెల్లడికివచ్చి పెండ్లికుమారు నాహ్వానించరు. కాని పెండ్లి కూతురి ఇంటికి సంబంధించిన నాయరుస్త్రీలు కొందరు, నంబూదిరీ స్త్రీలవలెనే వేషభూషణముల ధరించి ఎదురై, పెండ్లికొడుకు నింటిలోనికి గొనిపోవుదురు. పుణ్యాహమొనర్ప వెళ్లునపుడు అతని ముందు నంబూదిరీ యొకడు దీపారాధన పట్టుకొని నడుచును. అక్కడ పీటపైకూర్చోగానే - నాయరు స్త్రీ యొకతెవచ్చి చక్కెరకలిపిన నీటిపాత్రను అతని వెనుకపాటున నిలిచి చుట్టుత్రిప్పును. అప్పుడు మామగారువచ్చి అల్లునికి నమస్కరించి ప్రతినమస్కారమును స్వీకరించి అతనికి ఆచనమొనర్ప నీటితోపాత్రనిచ్చును. అప్పుడతడు కమ్ములు వేసిన నాలుగు పంచల చాపును (వారు చిన్నతుండు గుడ్డలనే పిఱుచుట్టుగా చుట్టు కొందురు) ఇచ్చును. అది పెండ్లికూతురున కివ్వగా ఆమె అందుండి రెండువిచి తాను ధరించుటకు తీసికొని మిగత రెండున్నూ తిరిగి పెండ్లికొడుకు కంపును. అప్పుడతడు వానిని ధరించును. ఇవే మన మధుపర్కములన్నమాట. వీనిని వారు 'మంత్రకోడి' యని పిలుతురు.

పెండ్లికూతురిని సంపూర్ణముగ మేలిముసుగువైచి వరుని వద్దకు పిలుచు కొని వత్తురు. అప్పుడామె పెళ్లికుమారుని ముఖము చూడకుండ అతనికి తన ముఖము కనపడకుండ - తాటియాకు గొడుగును అడ్డుపెట్టుకొని, పూమాల నొకటి అతని చేతికందించును. అతడు దానిని ధరింపగా పురోహితులు వేద మంత్రములు పఠించుచుండ - వధూవరులు ఒండొరుల చూచుకొందురు.

వారిలో పెండ్లికూతురునకు తాళిబొట్టు కట్టునది భర్త కాదు; తండ్రి. అనగా - వారు బాలికలకు తాళిబొట్టు కట్టుటను బాలురకుపనయనమొనర్చి యజ్ఞోపవీతము వేయుటవంటిదిగా భావింతురు. మాంగళ్యధారణానంతరము, ఉదకపూర్వ కన్యాదానము, పాణిగ్రహణమును జరుగును. పాణిగ్రహణమప్పుడు పెండ్లికూతురు ఒకచేత అద్దము పట్టుకొని, కుడిచేయి చాచి వ్రేళ్లు ముడుచును. ఆ ముడిచినచేయి విడదీసి అతడు పాణిగ్రహణ మొనర్చును. ఆ పాణిగ్రహణమున అతడు బొటనవ్రేలు పట్ట గలిగినచో మొగపిల్లలు కలుగుదురట. ఇతర వ్రేళ్లయిన ఆడపిల్లలు. అన్నియును కలిపి తెరిచిపట్టిన వారు వీరు పిల్లలు సమానముగ నుందురట. పాణిగ్రహణము అనంతరము వధూవరులు అగ్నిహోత్రమునకు ప్రదక్షిణము గావింతురు. ఆ వెంట సప్తపది జరుగును. మనలో మాంగళ్య ధారణమే వివాహచిహ్నము. వారికట్లకాదు. సప్తపది, ఉదకపూర్వం, పాణిగ్రహణం ముఖ్యములు. ఈ కళ్యాణకలాపమంతయు ముగియగానే మామ అల్లుని చేతులుపట్టుకొని "నాయనా నాబిడ్డను జాగ్రత్తగ కాపాడవలయును" అని ప్రార్థించును. మొదటిరోజు తంతంతయు ముగియగా పిల్లను తోడ్కొని పెండ్లికొడుకు తన యింటికిచేరును. మరి మూడురోజులక్కడ జరుగును. అవి దీక్షాదినములు. అప్పుడు భార్యాభర్తలు కలిసియే యుండి బ్రహ్మచర్యదీక్ష వహింతురు. ఆ దీక్ష కొందరు సం॥ము రోజులు అంతకుపైన కూడా సాగింప వచ్చును. ఎంతకాల మీ దీక్ష వహించిన అంత సుపుత్రు డుదయించునట. ఆ దీక్షాదినములు గడవగా - నాల్గవరోజున మంగళస్నానములగును. ఆ రోజున మరికొన్ని తతంగములు జరుగగా ఇద్దరుకలిసి ఒకే ఆకున భోజన మొనర్తురు.

ఈ నంబూదిరీలలో బోధాయన సూత్రులు - మరియొక విచిత్రమును చేయుదురు. వధూవరులిర్వురు నొక చెరువున దిగి కుండమూతి గుడ్డతో మూసి, అది వలగా నొక చేపను పట్టుదురు. అప్పుడొక బ్రహ్మచారివచ్చి ఆవు దూడ నెక్కడైన చూచితివా అని అడుగును. అప్పుడతడు ఇదుగో ఆవుదూడ యని, చేపని చూపును. వధూవరులంతట ఒకరి కొకరు నూనె రాచికొందురు. వధువు వరుని తల దువ్వును; సాయంకాలము పెండ్లికూతురి తలలో భర్త పూలు ముడుచును - ఆ సాయంకాలము కంకణ విసరనము, దానితో పెండి పూరి అయినట్లే.

మనకు వలెనే వారికిని పున్నామనరకమునుండి యుద్ధరించుటకు పురుష సంతానాపేక్ష మెండు. అట్టి పురుషసంతానము కొరకై వారెన్ని వివాహము

లైన చేసుకొనెదరు. వేలాది కట్నము లివ్వలేక స్త్రీ సంతానాధిక్యతను ఇష్టపడరు.

## ఆడ మళయాళము

ఆదిలో నేను మద్రాసునకు వచ్చినప్పుడు నేను చదువుకొనుచుండిన పాఠశాలలోని పిల్లకాయలు పెద్దవారలుకూడ అడమళయాళమును గురించి విచిత్ర విచిత్రములైన కబుర్లను చెప్పుకొనుచుండిరి. అడమళయాళము యెక్కడ నున్నదా యని ప్రాత క్రొత్త భూగోళశాస్త్రములను పిల్లవాండ్రు పలుమారు త్రిప్పుచుండిరి. ఈ మళయాళ రాజ్యము పశ్చిమ సముద్రతీరమున పర్వత ప్రాంతముల మధ్యనున్న మహారణ్యమందున్నదని అక్కడి అయ్యవార్లు చెప్పు చుండిరి. ఈ రాజ్యము సుందరమగు ఫలపుష్పవృక్షసమూహముతోను, నిర్మలమైన నీటితటాకములతోను, సెలయేళ్లతోను, జీవనదులతోను కూడిన నందనవనముతో సమానమగు వనమునందున్నదని చెప్పుచుండుట విను చుంటిని. ఆడమళయాళమనగ గాంధర్వకన్యకలు విచ్చలవిడిగ విహరించు చుండు దేవలోకమని కూడ చెప్పుచుండిరి.

ఈ ప్రకారము ఆ కాలమున యువకుల మనంబులను ఉద్రేకింపచేయు కథలను చెప్పుచుండిరి. మరియు అడమళయాళములో అడవారు తప్ప పురుషులే యుండరని చెప్పుచుండిరి. తప్పిదారి పురుషుడెవడైనను ఆ దేశమునకు పోయిన మళయాళమంత్రములతో వానిని వశపరచుకొని వారిండ్లలో బందీలుగ చేసుకొని వార్లచేత సేవ చేయించుకొనుచుందురని కూడ చెప్పుట వినియుంటిని. ఈ ప్రకారము కథలెన్నియో చెప్పుచుండిరి. ఈ కథలన్నియు నా చిన్ననాటి ముచ్చట్లు.

నా పెద్దనాటి ముచ్చట్లను ఇప్పుడిక్కడ వ్రాయుచున్నాను.

అడమళయాళమనగ మాతృభక్తిగల పుణ్యభూమి. స్త్రీ స్వతంత్ర రాజ్యము. మన దేశమున పురుషుడు పుట్టుకతో అనుభవించు సర్వస్వతంత్రము లన్నిటిని అక్కడి ఆడవారు జననమొందిన దాదిగ అనుభవించుచున్నారు. మన ఆడవారు ఇప్పుడిప్పుడే వారనుభవించుచుండు హక్కులవంటి వాని కొరకు అందోళనమును చేయుచు క్రమముగ ఒక్కొక్కహక్కును సంపాదించు కొనుచున్నారు. మనదేశపు స్త్రీలుకూడా అన్ని హక్కులను క్రమముగ సంపాదించుకొను శుభసూచనములు కనబడుచున్నవి. ఈ కలియుగమున

పురుషునియుగము పోయి క్రమముగ స్త్రీయుగము రాగలదని అందరును ఆతురతతో వేచియున్నారు.

మళయాళరాజ్యము స్త్రీస్వతంత్రరాజ్యమగుటకు పెక్కుకారణము లుండినను ముఖ్యమయినవాటిని ఇక్కడ వ్రాసెదను.

కేరళోత్పత్తికి మూలపురుషుడు పరశురాముడని యింతకు ముందు వ్రాసి యుంటిని. గనుక ఈ దేశమునకు పరశురామక్షేత్రమని, భార్గవక్షేత్రమని పేరుగలదు. పరశురాముడు ఉమామహేశ్వర్ల ఉపాసకుడు. పరమభక్తుడు. తాను సృష్టించిన కేరళరాజ్యము దుర్మార్గుల పాలు గాకుండుటకు పార్వతీ పరమేశ్వర్లను కాపలాకాయుటకు ప్రార్థించెను. అందుకు వారు సమ్మతించిరి.

ఈ పరశురామక్షేత్రము గోకర్ణము మొదలు కన్యాకుమారివరకు వ్యాపించియున్నది. గోకర్ణమునందు శివుడును కన్యాకుమారియందు శక్తియగు కన్యాకుమారియును కాపలాకాయుచున్నారు. కేరళదేశము పరాశక్తి స్వాధీనమందున్నందున ఈ దేశమంతయు శక్తియుతమైయున్నది. శక్తి అనగ అధికారము అని కూడ అర్థము. నవశక్తులలోను కుమారి, బ్రహ్మచారిణి అగుటవలన, సర్వశక్తులను సంపూర్ణముగ సమన్వయించుకొనిన నిర్వాణి. నిరంజని. ఎక్కడసౌందర్యము, సాహసము ఆకర్షనీయముగనుండునో అక్కడనే అధికారము కూడి యుండును. "శివశ్శక్త్యా యుక్త ప్రభవతి" అను శంకరుని వచనము.

శక్తిలేని శివుడు అశక్తుడు; శివుడులేని శక్తి మారణశక్తి. గనుక పార్వతీపరమేశ్వరుల సమ్మేళనముననే కేరళదేశము మాతృప్రభ ప్రజ్వలించు చున్నది. అయితే యిక్కడ విశేషమేమనగా తత్వతః శివుడు పార్వతికి భర్తయే గాని - వారికి వివాహబంధమేర్పడలేదు. విఘ్నమూర్తి అడ్డుపడెనని యొకగాథ. ఏది ఎట్లయినను - ఇచ్చట దేవి, భర్త్రాధీనయైన పరాధీనగాదు; కన్యాకుమారి - మాతృత్వము స్వతస్సిద్ధమైనను ఆ సృజన శక్తిని లోక కళ్యాణార్థమైన తనయందే లీనమొనర్చుకొన్న ఆదిశక్తి, పరాశక్తి.

కేరళరాజ్యమున మాతృపూజ ప్రతియింటను, గ్రామమునను జరుగు చుండును. కాళీ, మహాకాళీ, భద్రకాళీ, కాత్యాయిని, మహేశ్వరి, గౌరీ అను నామములతో గ్రామదేవతలున్నారు. ప్రతియింటను లక్ష్మి, పార్వతి, సరస్వతి, మాధవి అను పేర్లు గలవు. ఈ ప్రకారము దేశమంతయును శక్తియుతమైన ప్రభావముగల్గియున్నది. అయినను పైజెప్పిన కారణములవల్లనే

నవరాత్రములయందు మళయాళమున, విశేషముగ నేటికిని, కన్యకాపూజ సాగుచున్నది. - ఆ 9 రోజులున్నూ, వారు కన్యకలకు రక్తచందనము రక్తవర్ణ పుష్పములు, ఎఱ్ఱగా పండిన పండ్లు, కుంకుమ, కుంకుమపూవు మొదలైన పదార్ధములనిచ్చి ఆరాధింతురు. అనగా వినియోగముకాని సృజన శక్తి (మాతృత్వము) అగు సంతశక్తి అంతర్భూతమైయున్న కన్యకా స్వరూపము నారాధించి శక్తిసంపన్నులు అగుచున్నారు. అట్టి పూజా ధురంధరగములగుట చేతనే అచట స్త్రీలు - లోకవేడబమునకై మాతృత్వము నొక్కకపట్ల నంగీకరించియు సర్వస్వాతంత్ర్యమును వీడక, స్వాధీనలై పరాధీన తను దరినేర నీయకున్నారు. అసలచటి కన్యలకు వివాహనిర్బంధమేలేదు ; పలువురు అవివాహితులుగా నుందురు. ఆటగా బొమ్మరిల్లు నిర్మించి - ఆట గొల్లని దానిని చెరిపివేయుట కన్యకల కేళీవిలాస ప్రకృతి. అట్లే కన్యకా స్వరూపముననున్న శక్తికిన్నీ ఈ సృష్టియు, దాని లయమును లీలలు. పురుషులు నిట్టి కన్యకాయుపాసన కలవాటుపడ్డ వారగుటచే - భర్తృభావమున అధికారము వహింపక స్త్రీ స్వాతంత్ర్యమును శిరసావహించుచున్నారు - కావున ఈ క్రింద చెప్పబడబోవు ఆచార వ్యవహారముల కన్నిటికి ఈ పరత్వమే మూలము.

ఇక్కడ ప్రతి శుక్ర మంగళవారములనాడు అంబాలయములలో రక్తపుష్పార్చన జరుగుచుండును. అబలలు ఆవేశముతో భక్తిపరవశలై గీతములను పాడుచు విందులు ద్రొక్కుచుందురు. ఈ దృశ్యము వారి అబలత్వమును దెలుపుచుండును. ఆ దేవతలకు నిత్యమును గొప్పఅండాలతో పాయసములను నైవేద్యము చేయుచుందురు. భక్తులకు కుంకుమ చందనాదులను ప్రసాదముగ నిత్తురు.

## మాతృపూజ

కేరళమున గృహలక్ష్మిని కులదేవతగా పూజింతురు. కొమారుడు రాజు అయినను కన్నతల్లియెదుట చేతులుకట్టుకొని నిలుచుండుటయే వారిభక్తి విశ్వాసము. కూతుండ్లు అన్నదమ్ము ందరు ఆమె ఆజ్ఞను రాజాజ్ఞగ పాలించెదరు. కుమార్తెలు తల్లిని విడిచిపెట్టి అత్తవారింటికి పోవు ఆచారము అక్కడలేదు. భార్యకావలసివచ్చినప్పుడు భర్త భార్యయింటికి వచ్చిపోవుటయే వారి కులాచారము. ఇందువలన అక్కడి ఆడవారికి అత్తపోరు లేదు. ఆడ బిడ్డల రాపిడియును నుండదు. తల్లియే కుటుంబమునకు అధికారి. కుటుంబ ఆస్థియంతయు ముఖ్యముగ ఆడవారికే చెందును. తల్లి వార్సురాలు కూతురు ;

కొడుకుకాదు. ఫలాని తల్లి బిడ్డలందురుగాని ఫలానితండ్రి బిడ్డలనరు. కుమార్తె ఇంటిపేరు తల్లిదేగాని భర్తయింటిపేరుకాదు. తల్లి చనిపోయిన కుమార్తెలు కర్మచేయుదురు. తద్దినములను వారే పెట్టెదరు. మనము వంశమును నిలుపుటకు కుమారుని కోరునట్లుగా వారు కుమార్తెలను కోరుదురు. గనుక వారింట స్త్రీదేవియే పూజ్యురాలు. ఇక్కడిస్త్రీల స్వాతంత్ర్యాపేక్ష తెలుపుటకు మరియొక చరిత్రాంశముకలదు. వీరు అబలలుకారు. కత్తిగట్టి యుద్ధములొనర్చి వీరోత్సాహము వెలిబుచ్చియున్నవారే.

కేరళులు ఆర్యుల సంతతివారు. వారు ఆర్యావర్తము విడిచి ఈ దేశమునకు వచ్చుటకుముందే మనదేశమునకూడ మాతృపూజ యుండెను. అది క్రమముగ మరిగిపోయినది. ఇప్పుడు ఆలయములలోనుండు దేవికి పూజలు జరుగుచుండినను గృహదేవికి పూజ జరుగుటలేదు. అందువల్లనే మనదేశమునకు కొంత చీడ బట్టియున్నది. రానున్న స్త్రీయుగమునందైనను మాతృపూజ చేయకుండిన ఇంతకాలముస్త్రీలు అనుభవించిన అస్వతంత్రములను, పురుషులు అనుభవించక తప్పదని నావంటి వృద్ధులు హెచ్చరించవలసియున్నది.

మన తెలుగుదేశమున ప్రాచీనాచారము సంజ్ఞామాత్రముగనున్నట్లు తోచుచున్నది. అసలీ దేవిపూజ మాతృపూజగా పరిణమించి వ్యవహారమునందు మాతృప్రాధాన్యత ఏర్పడినది. తల్లిపేరుబట్టి ప్రసిద్ధులు పిలువబడేవారు. వైనతేయుడు, సాత్యవతేయుడు, గాంగేయుడు, రాధేయుడు, కౌంతేయులు, దేవకీనందనుడు ఇత్యాదులు - పితృనిర్దేశమైనను మాతృత్వము ప్రాధాన్యముగా పేర్కొనబడుటకు తార్కాణములు.

శాతకర్ణులు అనబడు ఆంధ్రరాజులు కొందరు గౌతమీ పుత్రశాతకర్ణి, మాధారి పుత్ర శాతకర్ణి, వాశిష్టపుత్ర పులమాయి - ఇత్యాదిపేర్లతో శాసనములందు పిలువబడినారు. ఇంకను నేటికిని మనపల్లెటూళ్లలో - 'పుల్లమ్మగారి సుబ్బన్న' అనుట వాడుకగలదు. మన గ్రామములలో సంపన్నులగు సంసారుల ఇండ్లలో - స్త్రీలదే చాలావరకు పెత్తనము. ఇవన్నియు నశించని పూర్వస్థితిగతుల చిహ్నములై యుండవలయును.

తిరువాన్కూరు జనాభాలెఖ్ఖలరిపోర్టు (1891)లో నీ క్రిందివిషయము వ్రాయబడియున్నది :-

(ఇంకా వుంది

చలనచిత్ర చరిత్రలో
మరో సంచలనానికి
నాందిగా
"ఆల్ రౌండ్ అగ్రహీరో"
**కృష్ణంరాజు**
వినూత్న పాత్రల్లో!

యు.వి.సూర్యనారాయణరాజు
సారథ్యంలో



గోపీకృష్ణా
కంబైన్స్....

# యమ ధర్మరాజు

యు.శివకుమారి
రేలంగి నరసింహారావు

ఓంకార్ • రాజ్ కోటి

గోపీకృష్ణా కంబైన్స్

23,25,27 తేదీలలో




# చెవిలో పువ్వు

కె.అశోక్‌కుమార్
ఇ.వి.వి.సత్యనారాయణ




## 1989 డిసెంబరు 30

డిసెంబరు మూడోవారం నుంచి మద్రాసు నగరం యావత్తూ సంగీత రసమయం. ఉదయంపూట జరిగే డిమానస్ట్రేషన్ - లెక్చర్లు సామాన్యులకు సంగీతకళ గురించి చెబుతూ, ఆ మెళకువలు వెల్లడిచేస్తాయి. బావుంది, బాగాలేదు - అనుకోవడం కేవలం పామరత్వం. సంగీతం కానీయండి, నాట్యం కానీయండి, చిత్రలేఖనం కానీయండి - ఏ లలితకళనైనా ఆనందించేందుకు, రసాస్వాదన పొందేందుకు, ఆ కళకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలు, సంప్రదాయాలు కొంతలో కొంత తెలిసివుండాలి - ఆ అభినివేశానికి మీవంతు కృషి వుండాలి. మార్నింగ్ పేపర్లులోని వార్తలు చదవటంలాటిది కాదు, ఒక పాట కచ్చేరీ ఆలకించడమూ, ఆనందించడమూను. అటువంటి అభిరుచి కలిగించేందుకు ఈ డిమానస్ట్రేషన్ లెక్చర్లు ఎంతగానో దోహదకారి అవుతున్నాయి.... ఈ ఉదయం బాలమందిర్ జర్మన్ హాలులో ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీవారు (53 ఏళ్లుగా లలితకళాభ్యుదయానికి ఈ మద్రాసులో అవిరళకృషి జేస్తున్న సంస్థ - సారధి: హెూ అండ్ కంపెనీ ఎంబెరుమన్నార్ చెట్టి) ఏర్పరిచిన లెక్చరు డిమానస్ట్రేషన్‌లో, అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ఇండియన్ స్టడీస్‌కి ప్రాంతీయ డైరక్టరైన పప్పు వేణుగోపాలరావు, 'క్షేత్రజ్ఞుని పదాల గాన మధురిమ' (The Melody of Kshetragna's Padams), సోదాహరణంగా సుభాషిణీ పార్థసారథి గాత్ర మాధుర్యంతో వివరించారు.... "అన్నమాచార్య శృంగార పదముల వల్ల ప్రభావితుడైన క్షేత్రయ్య, సంగీత సాహిత్యాలను సమ్మిళితపరిచి, అభినయానికి అనుకూలంగా వాటిని రచించి, మువ్వగోపాలునికి అంకితమిచ్చాడు. తను దర్శించిన ప్రతి క్షేత్రంలోని దేవునిపేర, పదముచెప్పి, తంజావూరు, మధుర రాజాస్థానములలో గౌరవం పొందాడు. ఈయన అసలుపేరు వరదయ్య. సంగీతమూ, సాహిత్యమూ, నాట్యమూ ఈ మూడూ త్రివేణీ సంగమయాయి క్షేత్రజ్ఞుని పదకవితలో" - అన్నారు పప్పు వేణుగోపాలరావు. 'అయ్యయ్యో వెగటాయినె, పయ్యెదమీద జేరి పవళించు

స్వామికి' అని నాద నామక్రియలో సుభాషిణీ పార్థసారధి పాడుతున్నప్పుడు, ఆ రూపచిత్రణ అతి లలితంగా మనోకాశాన మెదిలింది.... కపిలేశ్వర పురంలో శిక్షణపొంది, ఉజ్జయినిలోని కాళిదాసు ఉత్సవంతో యావద్భారత ఖ్యాతీ, గుర్తింపూ తెచ్చుకున్న ఉమా మహేశ్వరి, సంస్కృతంలో పదిహేను హరికథలు అనర్గళంగా చెప్పగలదు. ఆమె హరికథాకాలక్షేపం ఆలకించడం ఒక చక్కటి రసానుభూతి. దేశభాష లెన్ని వున్నప్పటికీ, దేవభాషగా పరిగణింపబడ్డ సంస్కృతానికి గల స్థానం అద్వితీయమైనది. గ్రీకు, లాటిన్‌ల వలె అది మృతభాష కాదు. దేవాలయంలోకి వెళ్లినా, పెళ్లిపీటలమీద కూచున్నా, ఏదైనా శుభకార్యం జరిపించినా, మీకు వినిపించేది సంస్కృతమే! స్వాతంత్ర్యం లభించిన కొత్తలో దీనిని రాజభాషగా (ఇజ్రేల్ హెబ్రూకి యిచ్చిన గౌరవంలా) చేదామనుకున్నారు గాని సాధ్యపడలేదు. జాతీయ సమైక్యతాలక్ష్యంతో, సంస్కృతంలో, మన పురాణేతిహాసాలలోను, చరిత్రలోను కనిపించే యితివృత్తాలతో పదిహేను కథలను రసరాగ రమ్యతతో, అభినయ కౌశలంతో, సుశ్రావ్య గానంతో, భావస్ఫూర్తి గల వాచకంతో చెబుతున్నారు ఉమామహేశ్వరి ('జగతి' - 1989 మార్చినెల ముఖచిత్రం). ఇవ్వాళ 'అభిజ్ఞానశాకుంతలమ్' (బాలమందిర్ జర్మన్ హాలులో ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ తరఫున). ఆ దయనీయ దృశ్యాలన్నీ కళ్లకు కట్టినట్లు పదసంపదతో వర్ణించారు. ఉమామహేశ్వరి ఎంతో ప్రజ్ఞావంతురాలు. ఆమె ప్రతిభ, మన ప్రాంతమూ, మన దేశమేగాక, భారత సంస్కృతీ వాహినికి చిహ్నంగా ఖండాంతరాలకు వ్యాపించ వలసివుంది. ఈ హరికథా ప్రక్రియలో ఒక వైశిష్ట్యం ఉంది. అది సంస్కృతంలో అవడంచేత, భాష తెలియనివారు సైతం మెచ్చుకుంటారు. ఆదిభట్ల నారాయణదాసుని (హరికథా పితామహుడు) టాగూర్ అంతటి మహనీయుడే ఘనంగా అభినందించారు: జాతీయ సమైక్యతా కృషిలో ఉమామహేశ్వరి ఉన్నత శిఖరాలు అధిరోహించాలని అభిలషిస్తున్నాము.... పోతనగా, వేమనగా, త్యాగయగా తెలుగు హృదయాన స్థిరవాస మేర్పరచుకున్న చిత్తూరు నాగయ్య, తెరవెనకకు వెళ్లిపోయి పదహారేళ్లయింది. నాగయ్య స్మారక నిధి (అధ్యక్షులు: ఇంటూరి; కార్యదర్శి: రాళ్లబండి) ప్రతీ సంవత్సరం ఆ పుణ్యాత్ముని జ్ఞాపకం జేస్తోంది ఇండియన్ పాల్‌మునిగా బాబూరావు పటేల్ చేత కీర్తింపబడ్డ నాగయ్య, తన పాత్రలో ఏవిధంగా లీనమయేవాడో అదీ యిప్పటికీ ఆశ్చర్యం గొల్పుతుంది. నటన ఆయన దృష్టిలో ఒక తపస్సు - ఆ తపస్సాధనలోనే ఆయన తన తనువు చాలించాడు. ఆయన దివ్యస్మృతికి నివాళులర్పించాక, 'భక్త పోతన'. పిక్చర్ ప్రదర్శించారు ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో. నాగయ్య 'సైలెంటు'గా కళారంగానికి ఎన్ని

మంచిపనులు చేశారో, వందరూపాయల విరాళానికి వెయ్యిరూపాయల పబ్లిసిటీ కోరే నేటి దాతలకు తెలీదు.

## 1990 జనవరి 06

అయిదారు వారాల క్రితం విజయవాడ నుంచి ఒక మహిళా కంఠం 'మాలతీగారిని మా ఇన్నర్‌వీల్ కాన్ఫరెన్సుకి ముఖ్య అతిథిగా ఆహ్వానించాలని అనుకుంటున్నాం - ఏడవ తేదీ ఆదివారం మీకు వీలుగా ఉంటుందా?" - అని అడిగారు. 'మిమ్మల్ని పిలవడమంటే మీకు పదమూడూ పధ్నాలుగు వందల ఖర్చు. ట్రయిన్ ఫేరే రానూ పోనూ వెయ్యికి పైగా అవుతుంది. మీ కమిటీవారు అందుకు అంగీకరిస్తే, రావడానికేమీ అభ్యంతరము లేదు' - అన్నాను. 'మీరు జంటగా వస్తారని మాకు తెలుసు - రేపటెల్లుండిలో డ్రాఫ్ట్ పంపుతున్నాము' - అన్నారు కాన్ఫరెన్స్ సెక్రటరీ సులోచనా ప్రసాద్ (ఇన్నర్ వీల్ డిస్ట్రిక్ట్ - 315).... ఆమె చెప్పిన ప్రకారం డ్రాఫ్ట్ వచ్చింది. ఆదివారం ఉదయం ఎనిమిదిన్నరకి కాన్ఫరెన్స్ ప్రారంభమవుతుందన్నారు. హౌరా మెయిల్ అయితే టైముకి అందుకోలేకపోతామేమోనని 'తమిళనాడు'కి తీసుకున్నాం - సూపర్‌ఫాస్ట్

గనక ఉదయం మూడుంముప్పావుకి చేరుతుంది. మేము ఎసి కోచ్ నుంచి దిగీ దిగగానే, అంత చలిలోను మమ్మల్ని రిసీవ్ చేసుకునేందుకు రాణీ, శివాజీ వచ్చారు. శని ఆదివారాలు రెండు రోజులూ రోటరీ సమావేశం ; ఆదివారం ఇన్నర్‌వీల్ కాన్ఫరెన్స్. 'నేను గవర్నరయే ఛాన్సు ఎలానూ లేదు గనక కనీసం రోటరీ గవర్నరు నైనా అవాలని నా అభిలాష' - అని శనివారం మీటింగులో ముఖ్య అతిథిగా అక్కినేని నాగేశ్వరరావు విసిరిన జోక్ చెప్పారు శివాజీ.... రాణీ శివాజీలిద్దరూ ఎంతో ఆదరంగా మమ్మల్ని 'మమతా'లో (హోటల్) దిగవిడిచి వెళ్లారు. అయిదో అంతస్థులోని సరికొత్త రూమ్. అయిదు నిముషాలలో కాఫీ పంపుతానని హామీ ఇచ్చారు శాస్త్రిగారు (మేనేజరు). ఆ ప్రకారమే కాఫీ వచ్చింది; కాఫీ తాగి, నడుం వాల్చగానే కునుకు పట్టినా, సూర్యకిరణాలు పొడవక ముందే మెలకువ వచ్చింది.

..... 07

"అందరూ లేడీసైనప్పుడు నేనెందు కండీ" - అన్నాను మమ్మల్ని తీసుకు వెళ్లడానికి వచ్చినవారితో. "కాదండీ, జెంట్స్ కూడా వస్తారు - అందులో మీకు తెలిసినవారు వుండకపోరు" - అన్నారు, ఆ వచ్చిన యిద్దరిలో ఒకామె .... లోనికి వెళ్లీ వెళ్లగానే పూర్ణా కామరాజు కనిపించారు - ముప్ఫయ్యేళ్ల పరిచయం. అనేకానేక స్మృతులు. ముఖ్యంగా డియల్; ఒక్క డియల్ అనే ఏమిటి, చాలామంది. ప్రముఖ పంపిణీదారులుగా (ఫిలిమ్) పూర్ణాది ఒక ప్రత్యేక స్థానం. అంతేకాదు, కామరాజుగారి అబ్బాయి, మా అన సూయా వేణుగోపాల్ అల్లుడు. 'ఇన్నర్‌వీల్ ఛీఫ్ గెస్ట్ శ్రీవారు' అని కామరాజు నన్ను తన మిత్రులెందకో పరిచయం చేశారు. ఇక్కడ (ఇన్నర్ వీల్ ఛెయిర్‌మాన్ ; విజయశ్రీ గుప్త) దీపారాధన అయాక, నన్ను రోటరీ కాన్ఫరెన్స్‌కి (సిద్ధార్థా గ్రవుండ్స్) పట్టుకుపోయారు.... రోటరీ ఇన్‌టర్నేషనల్ డిస్ట్రిక్ట్ - 315కి గవర్నరు (1989-1990) అనకాపల్లికి చెందిన సన్యాసిరావు. రోటరీ ఇంటర్నేషనల్ 1905లో స్థాపితమయింది. ప్రపంచ వ్యాప్తంగా, 168 దేశాలలో, 474 జిల్లాల విభజనగా, 24,461 రోటరీ క్లబ్స్‌లో సుమారు పదకొండు లక్షల మంది రోటేరియనులు వున్నారు ; అన్నిటా అత్యుత్తమ ప్రమాణం కాపాడుతూ, పేదలకు, దీనులకు, నిర్భాగ్యులకు నిరాశ్రయులకు సేవ చేయడమే కాకుండా విద్యా వైజ్ఞానిక సాంకేతిక రంగాలలో యువతకు నూతనోత్సాహమిస్తూ, అవకాశ ద్వారాలు తెరిపిస్తూ, సర్వ మానవ కళ్యాణానికై నిస్వార్థకృషి చేయడం వీరి ఆశయమూ, లక్ష్యమూను; రోటే రియనుల భార్యలూ, పిల్లలూ ఇన్నర్ వీల్ సభ్యత్వం పొందుతారు. రోటరీ ఇంటర్నేషనల్‌కి చెందిన ఖ్యూత్ ఎక్స్‌ఛేంజి ప్రోగ్రామూ, స్కాలర్‌షిప్

ప్రో గ్రామూ దేశాల మధ్యగల భౌగోళిక సరిహద్దులు చెరిపేసి ఏక ప్రపంచ నిర్మాణానికి దోహదకారి అవుతున్నాయి. ఏ స్వచ్ఛంద సేవాసంస్థ అయినా, కొన్ని పరిమితులకి లోబడి పని చేయవలసి వుంటుంది. రోటరీకి కూడా అటువంటి కట్టుడులు లేకపోలేదు. ప్రతి ఒక్కరి కన్నీరూ తుడవటమనేది పరమవిభునికి కూడా సాధ్యంకాదు.... కామరాజుగారు చాలామందిని పరిచయం చేశారు; కాని, కొందరితో మాత్రమే కార్డులు పుచ్చుకోవడమనేది జరిగింది. ఏమయితేనేం, యిది నాకొక కొత్త ప్రపంచం, నాకు తెలియని ప్రపంచం.... "ఏమండీ ఫాషన్ పెరేడ్‌కి వెళ్దాం, రండి" - అని పిలిచాడొక యువకుడు (కామరాజు బంధువు). సిద్ధార్థానుండి మళ్లీ గాంధీనగర్ వాసుదేవరావు హాలుకి (ఇన్నర్‌వీల్ కాన్ఫరెన్స్) వచ్చాం. పేర్లయితే జ్ఞాపకంలేదు గాని అందరూ కాలేజీ విద్యార్థినులు; సంపన్నకుటుంబాలకు చెందినవారు. రికార్డెడ్ మ్యూజిక్‌కి అనుగుణంగా వారు వేసిన స్టెప్పూ, వొలకబోసిన హొయలూ, కుమ్మరించిన సొగసులూ ప్రేక్షకులని ఆనంద సాగరాన ముంచాయి. ఆ సౌందర్య ప్రదర్శన

తో నవత, నాజూకు తప్పితే మరొక భావానికి ఆస్కారం లేదు.... ప్రదర్శనానంతరం బయటకొచ్చి నిల బడ్డప్పుడు, 'మాలతీగారి కోసం వెతుక్కుంటున్నారా ?' అని అడిగారు ఒకామె చిరునవ్వుతో! 'మరి అంతేకద' అని నేనంటూండగా, 'అదిగో, ఆ చెట్టు కింద ఎవరితోటో మాట్లాడుతున్నారు - పిలవమన్నారా ?' అని అడిగారామె. 'వద్దులెండి - తనే వస్తుంది' అన్నాను. ఆ తర్వాత ఎంతసేపో ఏలూరు కబుర్లు. ఏలూరులో 'మావి' అంటూ ఏమిాలేవు- జ్ఞాపకాలు తప్పించి!... కాన్ఫరెన్స్ ముందు అందరికీ హడావిడి ; ఆ తర్వాత ప్రాణం కుదుటబడ్డ తెరపి! మూడున్నరకి కాబోలు ఈమె కిచ్చిన మెమెంటో పుచ్చుకు, ఏడెనమండుగురు లేడిస్ వచ్చారు రూమ్‌కి. ఇద్దరం వంతులు వేసుకు కబుర్లు చెప్పాము. ఒక్క సులోచనా ప్రసాద్ తప్ప, మిగతావారి పేర్లుకూడా అంతగా గుర్తు లేదు. ఎనిమిదిన్నరకి మమ్మల్ని స్టేషన్‌లో దింపేందుకు వస్తామని ఆరు గంటలకు వెళ్లారు వారు.... మా రిటర్న్ టికెట్స్ 'స్వాతి' బలరామ్ వద్ద ఉన్నాయి. అంచేత, వారింటికి వెళ్లి, అమ్మాజీ స్పెషల్‌గా తయారు చేయించిన ఉప్మా తిని, చిక్కటి మజ్జిగ తాగి, రూమ్‌చేరుకొనేసరికి నియంత దంపతులు (గోరాగారి అబ్బాయి) మరొకామె వచ్చివున్నారు. మమ్మల్ని మారుతిలో దింపి, ప్లాట్‌ఫారమ్ మీదకి వస్తామనగా మేమే వద్దన్నాము

ఎంచేతనంటే, టిసి మమ్మల్ని ఏ రైలెక్కిస్తాడో మాకు తెలీదు. కాని, ఏదో ఒక రైలులో మమ్మల్ని ఎక్కించక పోడని ఘట్టినమ్మకం. 'సార్, మిమ్మల్ని జిటిలో పంపుతాను - రెండు ఎసి బెర్తులు వుండకపోవు ; లేకపోతే, ఫస్ట్‌క్లాస్ ఎక్కిస్తాను. నిర్విచారంగా వెయిటింగ్ రూమ్‌లో కూచోండి' - అని చెప్పారు టిసి రాజగోపాల్. ఆ ప్రకారమే ఎసి స్లీపర్ ఎక్కించారు ; తెల్లారి ఆరుగంటలకి కాఫీ ; ఏడుం పావుకి మద్రాసు సెంట్రల్. మాలతి గారు ఏ విషయమై ప్రసంగించారో, నేను వినలేదు కాబట్టి నాకు తెలీదు. బహుశా, 'స్త్రీల ప్రగతి' గురించి అయి వుంటుంది.

. . . . . 08

కెజె సరస వద్ద భరతనాట్యం అభ్యసించిన లక్ష్మి, వెంపటి చినసత్యం వద్ద కూచిపూడి నేర్చుకు, అందులో తగుశిక్షణ అలవడ్డాక, కూచిపూడి నాట్యప్రదర్శనలు ప్రేక్షకుల మెప్పు పొందేరీతిని యిచ్చి, మళ్లీ భరతనాట్యం వైపు మళ్లింది. నాట్యరీతులలో వైవిధ్యం ఉన్నా, నాట్యకళోపాసన ఒక్కటే ; నాట్యకళకు అంకితమైన లక్ష్మి, యివ్వాళ రామారావు కళా మండపంలో భరతనాట్య ప్రదర్శన ఎంతో రక్తికట్టింప జేసింది. కూచిపూడి అయినా, భరతనాట్యమైనా అంకిత భావంతో ప్రదర్శన యివ్వడం లక్ష్మి లోని ప్రత్యేకత. అదొక విద్యా ప్రదర్శనకాదు - హృదయ నివేదన

. . . . . 10

మిత్రులు శివస్వామి కొచ్చిన్‌నుంచి కలకత్తాకు ఛీఫ్ కమీషనర్‌గా (ఇన్‌కమ్‌టాక్స్) ట్రాన్స్‌ఫరైన సందర్భంగా, న్యూయియర్‌డేకి బదులుయివ్వాళ, మాయింట్లో వీడ్కోలు విందు.—రాజాలక్ష్మి, సరోజినీ, ప్రేమ్‌చంద్, జయా - వేణుగోపాలరావు, రాధా - శివస్వామి, మిసెస్ అండ్ మిస్టర్ రెడ్డి, రేణు - శ్రీనాధ్, రామనాధ్, రాధాకుమారి - రావి కొండలరావు మాయింట్లో ముగ్గురం, యిలా మొత్తం ఇరవైమంది. డాబామీద అయితే కొంచెం విశాలంగా ఉండేది - కాని, మంచు భయం యిందులో చాలామందికి ! అందుకని మాలతీ, శారదా ఉన్నంతలో సర్దుబాట్లు చేశారు.... వచ్చిన వారందరూ డిన్నర్‌లోకి ఏమిటేమిటో అయిటమ్స్ పట్టుకొచ్చారు. బుఫె యరేంజిమెంట్సు రేణూ, శ్రీనాధ్ తమ పర్యవేక్షణలోకి తీసుకున్నారు. సాఫ్ట్‌డ్రింక్సూ చిప్సూ యిత్యాదులయాక, అయిటమ్స్ వారీ పంపిణీ రేణూ శ్రీనాధులది. శివస్వామి రెండు పాటలు పాడారు; విజయనగరం ప్లీడరుగారి గురించి చెప్పి నవ్వించారు పప్పు వేణుగోపాలరావు. ఇక, రావి కొండలరావు తెలుగు మాస్టారి విషయం చెప్పనక్కర్లేదు - అనప్పుడు నుంచి స్టుడియో సందర్శనం దాకా ! రెడ్డిగారి పద్యాలు మరొకసారికి







రిజర్వ్ చేసుకున్నాం. 'బై - బై' చెప్పు కొనేసరికి యించుమించు పన్నెండ యింది.

## 13

జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత నారాయణ రెడ్డి గౌరవార్థం హొటల్ సవేరాలో అభినందన సమావేశం. 'మంటలు - మానవుడు' ఎవికె రెడ్డికి (సవేరా మేనేజింగ్ డైరక్టరు), 'విశ్వంభర' రమణయ్యరాజాకు (రాజాలక్ష్మి ఫౌండేషన్, అంకితమిచ్చి వున్నారు. ఈనాటి సభకు వీరిద్దరూ ముఖ్య సారథులు. కొలను పక్క ఉపాహారం అయాక, వృక్షచ్ఛాయను దీపకాంతుల మధ్య వేదిక, ఏడెనిమిదేళ్ల క్రితం యిటువంటి ఆనంద సంధ్యలోనే నారాయణరెడ్డి 'లాంగ్ప్లే' రికార్డ్ యిదేచోట విడుదలయింది. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీతలందరిలోను నారాయణరెడ్డి, వయసులో మాత్రమే చిన్న ; కాని, రసగ్రహణ పారీణతలో, కవన సౌందర్యవాహినిలో, విశ్వమానవ గీతికాలాపనలో ఎందరి కంటెనో మిన్న. ఆంధ్ర సరస్వతి తనను విశ్వనాథ సరసను వుంచిందని అనడం ఆయనలోని ఔన్నత్యానికీ వినయానికీ మచ్చుతునక. ఈ అజాతశత్రువు వినయ వివేక గుణసంపన్నుడనీ మల్లెతీగలా ఆయన కవిత, కాంతులూ క్రాంతులూ వెదజల్లాలనీ అన్నారు ముఖ్య అతిథి యమ్మెస్ రెడ్డి. సభాధ్యక్షులు ఎవికె రెడ్డి, సినారె స్నేహం తమకొక మహాసంపద - అన్నారు. నావి మాట్లు (మాటలు), ఆయనివి పాట్లు (పాటలు) - అని భమిడిపాటి రాధాకృష్ణ చమత్కరించగా, మిల్టన్స్ 'పారడైజ్‌లాస్ట్'లోని అంతరంగక్షోభ 'విశ్వంభర'లో ద్యోతకమవుతోందన్నారు పప్పు వేణుగోపాలరావు. "యమ్మెస్ సుబ్బలక్ష్మిగానాన్ని ఐక్యరాజ్య సమితిలో 108 దేశాలవారు విన్నారు - అటువంటిదే నారాయణరెడ్డి కవితాలహరి. ఇరువురు ప్రఖ్యాత కవుల మధ్యనున్న కాలమే సాహితీచరిత్ర" - అన్నారు గొల్లపూడి మారుతీరావు. '1957 లో విజయనగరంలో జరిగిన రాఘవనాటకోత్సవాల సందర్భంగా నారాయణ రెడ్డిగారిని కలుసుకున్నాను. 1961లో యన్‌టి రామరావుగారి 'గులేబకావళి'కి రాసే అవకాశం ఆయనకు లభించింది - అదే ఆయన మొదటి చిత్రం. ఆయనకు నన్ను 'అగ్రజా' అని పిలవడం అలవాటు. కవితార్ఘురికి అతీతమైన కుటుంబస్నేహం మాది' అన్నారు మిక్కిలినేని... "1968 నుంచి 1982 దాకా, ఆమధ్యకాలంలో నేను వ్రాసినవన్నీ పరిగణనలోకి తీసుకు, ఈ అవార్డ్ యివ్వడం జరిగింది. ఈ అవార్డుల వెనకనుండే గాథ, ఎదురుగా కూచున్న డి ఆంజనేయులు గారికీ, మాలతీ - చందూర్ దంపతులకీ తెలుసు. ఈఅవార్డ్ నాపై వినూత్న బాధ్యత మోపుతోంది. నాశక్తి వంచన లేకుండా కృషిచేస్తాను. మీరందరూ చూపుతున్న ఆదరానురాగాలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు' - అని చెప్పారు నారాయణరెడ్డి తమ

సమాధానంలో... 'కళారంజని' పాండు రంగ ఈ కార్యక్రమ నిర్వాహకులు.

. . . . . 17

సినీ నిర్మాత విశ్వేశ్వరరావు ముఖ్య అతిధిగా, హైదరాబాదుకి చెందిన ఆదర్శ యువభారతివారు కళాసాగర్ ఆహ్వానంపై, 'శంకరదాస్'లో 'దొరా, నీ సావు మూడింది' నాటకం ప్రదర్శించారు. మొదలి నాగభూషణశర్మ రచన. కొండజాతివారి జానపద గీతికలతో వర్గవైరుధ్యాన్ని చిత్రింపబూనే ఈ ప్రదర్శనలో, స్వభావన్యాయం గాని, వాస్తవికతగాని లేవు. కాగడాలు చేత బుచ్చుకు, హాలులో నుంచి స్టేజి మీద కెక్కడం, షావుకారు సాయంతో కాపిటలిస్టుని తుదముట్టించడం యిందులోని సారాంశం. నటన సమర్ధవంతంగా ఉన్నప్పటికీ, నేటి సామాజికులని మెప్పించలేని యితివృత్తం.

18

జయప్రదా ఇంటర్నేషనల్ వారు, శ్రీరామ్‌కుమార్ కథానాయకుడుగా, 'చిన్న' అనే యాక్షన్ మూవీ నిర్మిస్తున్నారు. ఈ ఉదయం పదిగంటలకు కర్పగం స్టూడియోలో ముహూర్తం. పోలీసు సూపరెంట్ డ్రెస్‌లో వున్న జయప్రద, బొంబయి ప్రెస్ కంటె మద్రాసు ప్రెస్ ఎంతో మంచిది, మర్యాదైనది - అని మెచ్చుకున్నారు. ఏప్రిల్ నాలుగవ తేదీ ఆమె పుట్టిన పండగ నాటికి, ఈ పిక్చర్ రిలీజ్ చేయాలని ప్లాన్ చేస్తున్నారు.



## 19

ఫొటొగ్రఫీ 19 వ శతాబ్ది మధ్య భాగానికి పెద్దల ఆదరణ పొందినప్పటికీ, 1884 లో ఈస్ట్‌మాన్ కనిపెట్టిన రోల్ ఫిలిమ్ కారణంగా అది బహుళ వ్యాప్తినొందింది. 1888 నాటి కొడాక్, ఛాయాచిత్రాన్ని ప్రజలకు అత్యంత చేరువగా తెచ్చింది. జ్ఞాపకం ఉంచుకోవలసిన ఘట్టం, నేత్రానంద కరమగు దృశ్యం కెమెరాలో బందీ అయాయి. ఫొటోగ్రఫీ ఒక కళా ప్రక్రియగా బెర్లిన్, హాంబర్గ్, డ్రెస్‌డన్ మ్యూనిక్ వంటి నగరాలలో ఫొటో క్లబ్బుల ద్వారా వ్యాప్తమయింది. కెమెరా టిక్కు మనిపించడం కాదు - ఒక వ్యక్తిలోని హావ భావ స్ఫూర్తినో ఒక దృశ్య చయనిక్‌లోని వెలుగు నీడల గీతకనో కెమెరా ద్వారా పొందుపరచడం, ఈ మాదిరి ఆర్ట్ ఫొటోగ్రఫీ 19 వ శతాబ్ది చివరి దశకంలోను, 20 వ శతాబ్ది మొదటి దశకంలోను, ఇంచు మించు ఇరవై పాతికేళ్లపాటు, యూరప్ దేశాలలోను, అమెరికాలోను వృద్ధి జెందింది. మొదటి ప్రపంచ యుద్ధంతో ఈ 'ఆర్టఫార్మ్' కాల గర్భాన కలిసిపోయింది. గ్రీమ్స్ రోడ్‌లోని 'లలితకళా అకాడమీ' లో మాక్స్‌ముల్లర్ భవన్‌వారు '1900 నాటి జర్మనీలోని ఆర్ ఫొటొగ్రఫీ' అనే ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. కెయన్ రాఘవేంద్రరావు పరిచయ వాక్యాలు చెప్పారు. 1890 లో వియన్నాలో తీసిన 'జాలరులు' చిత్రంతో ప్రారంభమైన ఈ ఫొటో ప్రదర్శన, 1903 నాటి రుడోల్ఫ్ చిత్రంతో ముగుస్తుంది. 1848 నాటి పిగ్‌మెంట్ ప్రింటూ, 1904 నాటి ఫొటోగ్రావూర్ కూడా ఈ ప్రదర్శనలో ఉన్నాయి. 62 ఫొటోలుగల ఈ ఎగ్జిబిషన్ చూస్తున్నప్పుడు, ఒక శతాబ్దం వెనకనుంచి ఈ కళారూపాలు, సన్నగా ఏదో సందేశం చెబుతున్న భావన కలుగుతుంది. రైతు వనిత, తల్లీ కూతురు, లేడీ విత్ లిల్లీస్, జలాశయం, తీరరేఖ వంటి పిక్చర్స్ నుంచి కళ్లు తిప్పుకోలేక పోతాము. మానవుడు తన అనుభూతిని ముందు తరాలవారికి అందీయడమే అన్ని కళలలోని పరమార్థం.... అక్కడ నుంచి తన్నగా బర్కిట్‌రోడ్‌లోని శర్వాణీ సంగీత సభకు (ఆంధ్ర బాలానంద సంఘం). నిన్న, యివ్వాళ, రేపు - ఈ మూడురోజులూ వారి వార్షికోత్సవం. 1987 జనవరి నుంచి ఈ శర్వాణీ సంగీత సభ (సెక్రటరీ: వసంతా రామకృష్ణ) ఔత్సాహిక గాయనీ గాయకులను ప్రోత్సహిస్తున్నది. ఇవ్వాళ వాద్య సంగీత కచ్చేరి - దుర్గాప్రసాద్ (గోటు వాద్యం), రాఘవ రామన్ (ఫ్లూట్) హేమామాలిని (వయొలా), బాలాజీ (మృదంగం), రంగనాథన్ (మృదంగం), శంకర్ (ఘటం), ముఖ్య అతిథి: బివియస్సెస్ మణి; అధ్యక్షులు: లోక్‌నాధ శర్మ. నిన్న సాయింత్రం డికె పట్టమ్మాళ్, శర్వాణీవారి నాలుగవ వార్షికోత్సవానికి దీపారాధన చేశారు.

. . . . . 25

శ్రీశైలం ప్రాజెక్ట్ ఛీఫ్ ఇంజనీరు కృష్ణమూర్తిగారు, పదిరోజుల క్రితం ఫోన్‌లో, "రిపబ్లిక్‌డేకి మీ యిద్దరూ యిక్కడికొస్తున్నారు. 25 వ తేదీ ఉదయం నాలుగున్నరకి మీ యింటి ముందుకి కారు వస్తుంది - మీరక్కడ అయిదుగంటలకి బయలుదేరితే మూడున్నర నాలుగయేవేళకి శ్రీశైలం చేరుకుంటారు. మాలతిగారి సిస్టర్ని హైదరాబాదులో అడిగాను - ఆమె రావడానికి అంగీకరించారు. శారదాంబ గారిని కూడా తప్పక తీసుకురండి.... అంబాసిడర్ గనక మీ ముగ్గురితో బాటు మరొకరు కూడా రావచ్చు" అని గడగడా చెప్పేశారు. అంతటి ఆదరాభిమానాలతో అప్యాయంగా పిలిచే వారి మాట కాదనగలమా? ప్రాజెక్ట్ ఏరియాలోని ప్రకాశమ్ హాలులో, లక్ష్మి, అన్నమాచార్య సంకీర్తన చేస్తారు ('జగతి' – 402 నెంబరులో 38-42 పేజీలలో చెప్పిన లక్ష్మి); మాలతీచందూర్ నాలుగు ముక్కలుచెప్పి ఆమెని ఆశీర్వదించాలి; ఆ రెండిటితోబాటు మేము శ్రీశైలం చూడాలి... కృష్ణమూర్తిగారికి తెలిసిన వారు యిక్కడ మా ట్రావెల్ యరేంజిమెంట్స్ చూశారు; సరిగ్గా నాలుగున్నరకి '3306' మా కాంపవుండ్‌లోకి వచ్చి ఆగింది. స్నానాలూ కాఫీలూ అయాయి; యిడ్లీచెట్నీ, పూరీకూరా, తైరుసాదం, చిప్సు యిత్యాదులూ, నీళ్లబిందె, పెట్టెలూ అన్నీ డిక్కీలోకి ఎక్కాయి; జస్టిస్ జంబులింగం వీధిలో

రాధాశివస్వామిని ఎక్కించుకున్నాం; ఆమె బ్రెడ్డూ, బిస్కెట్లూ, స్వీట్లూ, పళ్లూ ఎక్స్ట్రా పట్టుకొచ్చారు. ఏమయితేనేం, అయిదుకాక పూర్వం సిటీ వొదిలి, చాలారోజుల తర్వాత సూర్యోదయ సౌందర్య దీప్తులని 'తడ' ప్రాంతాల చూశాం. డ్రైవర్ చంద్రన్ (అసలు పేరు చంద్రశేఖరశర్మ) చాలా నెమ్మదస్థుడు; కష్టసుఖాలు తెలిసిన కుటుంబీకుడు; ముగ్గురుపిల్లల తండ్రి. అమ్మాయి బికామ్ చదువుతోందట; మిగతా మగపిల్లలిద్దరూ చిన్నవాళ్లు.... వనితలు ముగ్గురూ వెనకసీట్లో; నేను ముందు సీట్లో; 60 కిలోమీటర్ల యూనిఫార్మ్ స్పీడ్‌లో కారు పోతోంది. కబుర్లు వూరడమంటారే - ఆ ప్రకారం వుంది - ఎంతకీ తరగడంలేదు కబుర్లు. గూడూరు బైపాస్ రోడ్ చేరుకొనేసరికి ఎనిమిదయింది. అమాంతంగా రాధ 'నాకు ఆకలేస్తోంది' అన్నారు. 'నెల్లూరు దాటాక టిఫిన్ తిందాము' అన్నాను. 'ఇంకా ఎంతసేపు పడుతుంది? నేను తట్టుకోగలనో లేదో శారదంబక్కయ్యా, మీకూ ఆకలేస్తోంది కదూ?' అన్నారు రాధ అల్లరిగా. 'ఏం ఫరవాలేదు - మీకు శోషరాకుండా అడ్డుకునేందుకు ముగ్గురం వున్నాం. అంతగా ఆకలైతే రెండు బిస్కట్లు తినండి. నెల్లూరు బైపాస్ అయాక, పడుగుపాడు వంతెన దాటాక, చెట్టునీడని హాయిగా ఒక అరగంటసేపు మనకీ, డ్రయివర్‌కీ, కారుకీ రెస్టు' - అన్నాను. రాధాశివస్వామికి యిద్దరు పిల్లలు - అబ్బాయి చిదంబరంలో లెక్చరర్; అమ్మాయి మద్రాసులో ఎమ్‌బి పాసయింది. ఎందుకు చెబుతున్నానంటే, ఆమె ఆకలేస్తోందని అనడం నవ్వుతాలకే గాని నిజంకాదు.... పడుగుపాడు వంతెన దాటాక, కడుపునిండా టిఫిన్ తిన్నాం - ఇడ్లీ, హల్వా, మురుకులూ ఆపైన కమలాఫలాలు.... పెట్రోలు కోసం ఒంగోలువద్ద ఊళ్లోకి వెళ్లవలసివచ్చింది. బయలుదేరుతున్నప్పుడు 56 లీటర్లు పోశారట; 340 కిలోమీటర్లు వచ్చాం; ఇంకా 170కి.మీ. ప్రయాణం చేయవలసిఉంది. ఒంగోలు చేరుకొనేసరికి పదకొండుంపావు; ఊళ్లోకి వెళ్లి రావడంతో అనవసరంగా ఒక గంట వేస్టయింది. ఒరిజినల్ ప్లాన్ ప్రకారం శ్రీశైలం మూడులోపున చేరివుందుము; గంటలేటు గనక నాలుగవుతుంది. ఒంగోలు దాటా" పూరీకూర, తైరుసాదం, స్వీటూ, దారిలోకొన్న చక్రకేళీలు, చిప్సూ. 'ఇంట్లో ఉన్నప్పటికంటె ప్రయాణంలో చిరుతిండ్లు ఎక్కువ తింటాం' - అన్నారు రాధ.... పొదిలిలో కొబ్బరి బొండాలు; మార్కాపురంలో కూల్ డ్రింకులు; దోర్నాలలో, వచ్చేటప్పుడు మెరపళ్లు కొనాలని వనితల నిర్ణయం; నాలుగుంపావు అయేసరికి శ్రీశైలం గెస్ట్ హవుజ్ చేరుకున్నాం.... నిన్న మధ్యాహ్నం కృష్ణమూర్తిగారు ఢిల్లీనుంచి, 'నేనిక్కడికి అర్జంటు పనిమీద వచ్చాను. మీరు రేపు సాయింత్రానికి శ్రీశైలం చేరుకుంటారు. నేనివ్వాళ హైదరా

బాదు వెళ్ళి, ఎల్లుండి ఉదయం పదకొండు గంటలకి శ్రీశైలం వస్తాను. సుబ్బారావు అనే ఆయన మీ యరేంజిమెంట్సన్నీ చూస్తారు. మీరక్కడికి వచ్చేవేళకి నేను లేకపోయినందుకు ఏమీ అనుకోకండి' – అని ఫోనులో చెప్పారు..... మా కారు గెస్ట్‌హవుజ్ రిసెప్షన్ చేరుకున్న మూడునిముషాలలో సుబ్బారావు వచ్చారు. 'రెండు రూమ్స్ బుక్ చేశాం' - అన్నారు. 'రెండు వద్దు - కొంచెం విశాలంగా వుండే ఫామిలీరూమ్ ఒక్కటి చాలు; మరొక బెడ్ వేయించండి' - అన్నాను. నాలుగు బెడ్స్‌తో విశాలమైన ఎసి రూమ్ - డ్రాయింగూ, డైనింగూ అంటిపెట్టుకునున్నది - మాకు ఇచ్చారు .... గేజర్ ఆన్‌చేసి, కాఫీలుతాగి, హాయిగా స్నానంచేసి, భ్రమరాంబా మల్లికార్జునులను చూడటానికి, ప్రాజెక్ట్ వారి వాన్‌లో బయలుదేరాం. ప్రాజెక్ట్ ఏరియాకీ, ఆలయానికీ పది కిలోమీటర్ల దూరం. బస్సులోనో, కారులోనో వెళ్ళవలసిందే తప్ప నడిచి వెళ్ళడమనేది కుదరదు.... ఆంధ్రాకు త్రిలింగ (తెలింగ, తెలుంగ, తెలింగ) దేశమనే పేరు శ్రీశైలం, కాళహస్తి, దాక్షారామముల మధ్యప్రాంతమనే కారణంగా వచ్చింది. శ్రీశైలంలోనిది జ్యోతిర్లింగము. 1304 దుందుభినాటి మన్యమాపుర శాసనం ప్రకారం, సింహాచలంనుంచి శ్రీశైలందాకా అన వేమారెడ్డి పాలించినట్లు చెబుతారు. శ్రీశైల మల్లికార్జునుని ఆలయం 13వ శతాబ్దిలో కాకతి మైలాంబ కట్టించినట్లూ, విజయనగర సామ్రాజ్యపు రెండవ హరిహరరాయలు పాలనలో యిది ఉన్నట్లూ చారిత్రకాధారాలు కనిపిస్తున్నాయి. అయితే, ఈనాడు మనకక్కడ కనిపిస్తున్న దేవాలయ పునర్నిర్మాణం యావత్తూ, హిందూదేవా

లయ ధర్మాదాయశాఖ కమీషనర్ పైడి లక్ష్మయ్య 1957లో చేయించినది. రాకపోకల సౌకర్యాలు, యాత్రికులకు వసతి యిత్యాదులన్నీ ఆయన చేసినవే! - అంతకి పూర్వం లేకపోలేదు; కాని, వాటికీ నేడున్నవాటికీ సామ్యంలేదు. అయితే, ఇప్పటికీ దారిభయం, దోపిడీ భయం ఉన్నాయంటారు.... స్థానికంగా పలుకుబడిగల ఇంజనీరు సుబ్బారావు, మమ్మల్ని తిన్నగా గర్భగుడిలోకి తీసుకువెళ్లారు. వనితలు ముగ్గురూ నారికేళజలంతో అభిషేకము చేయించారు. హారతి ప్రసాదం మామూలే! చిన్న చిన్న గుళ్లు చాలా ఉన్నాయి. తిరుపతిలోకి మల్లేనే యిక్కడకూడా సుప్రభాతం, కల్యాణం, పవళింపుసేవ యిత్యాదులన్నీ ఉన్నాయి. భారతీయ సంస్కృతిలో నిర్గుణోపాసన కంటె సగుణోపాసన బహుజనాకర్షణీయం. నిరాకారునికి ఆకృతి యిచ్చి, ధూప దీప నైవేద్యాలతో పూజించడమే ఆలయ నిర్మాణంలోని అంతర్యం. శివుడు కావచ్చు, విష్ణువు కావచ్చు, ఆదిశక్తి కావచ్చు, ఆంజనేయుడో విఘ్నేశ్వరుడో కావచ్చు - ఎవరైనప్పటికీ మంత్రపుష్పం, పూజా, నైవేద్యం యిత్యాదులన్నీ ఒకటే!.... ఆలయమంతా పరిశుభ్రంగా ఉంది. ఉద్యానవనంలోని కళ్యాణవేదిక పూలసౌరభాలు విరజిమ్ముతోంది. అనునిత్యం దేవునికి పెళ్లి జరిపించి, ఆ వివాహక్రతువు ద్వారా మనశ్శాంతి పొందేవారు, పుణ్యమాశించేవారు, లక్షోపలక్షలు. ఆలయ సందర్శనలో చివరి అయిటమ్ అద్దాలగది. పూజలందుకునే స్వామి తూగుటుయ్యాల ఉంది అక్కడ. పవళింపుసేవ మాట ఎటున్నా, ఎవరికివారు తమ అసంఖ్యాక ప్రతిబింబాలు చూసుకుంటారు ఆ అద్దాలగదిలో.... ప్రత్యూష సమయాన ఉదయం అయిదున్నరకి జరిగే అర్చనకు (రు. 116/) సుబ్బారావు తీసుకు వెళ్తానన్నారు.... 'మీరు ముగ్గురూ వెళ్లండి - మంచు టోపీలు పెట్టుకున్న కొండ వెనకనుంచి వచ్చే ఉదయకాంతులు చూస్తాను - మీరు వెళ్లి అర్చనలు చేయించి రండి' - అన్నాను మాలతితో. 'మా గోపికి మల్లేనే గుళ్లూ గోపురాలు అంటే ఈయనకు గిట్టదు - కేరళ ట్రిప్‌లో చూశానుగా!' - అన్నారు రాధ.... 'విజయరత్నం (బేరర్) ఎనిమిదిన్నరకి ఇడ్లీ, వడా తీసుకువస్తానన్నాడు - ఈ లోపున ముగించుకు రండి' - అన్నాను....

..... 26

నాలుగున్నరకి నిద్రలేచి, ఉడుకునీళ్ల స్నానంచేసి, అయిదుగంటలకు వేడివేడి కాఫీతాగి, సుబ్బారావుగారి జీపులో ఆలయ దర్శనానికి, అర్చన చేయించేందుకు బయలుదేరారు అతివలు ముగ్గురూ... వారు వెళ్లాక, నేను స్నానంచేసి, లాన్‌లోకి వచ్చాను. ప్రాగ్దిశలోని వివిధ రోచిస్సుల వర్ణ వైభవం, రిబ్బను లాటిరోడ్డూ చూస్తూ, చిరుచలిలోని కొండగాలి పీల్చేందుకు! పరవశింపజేసే ప్రకృతి సౌందర్యం

ఎవరినైనాసరే అంతర్ముఖుని గావిస్తుంది..... మేము బసచేసిన మల్లికార్జున్ గెస్ట్ హవుస్‌ని, ఆంధ్రా ఫైనాన్స్ మినిస్టర్ జి రాజారామ్ 1975 సెప్టెంబరు 3వ తేదీన తెరిచారు.... శ్రీశైలం హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు కాచ్‌మెంటు ఏరియా 79వేల 5వందల చ॥ మైళ్లు; స్ప్రెడ్ ఏరియా, అనగా, నీరు నిలిచే వైశాల్యం 238 చ॥ మైళ్లు.

1680 అ॥ల పొడవుగల డామ్‌పై భాగాన 940 అ॥లు. ఏభై అడుగుల (వ్యాసం) వలయాకారంలో ఉండే సొరంగం గుండా 2428 అ॥ల మేర ప్రవహించేజలం మొదటిస్టేజిలో 110 మెగావాట్స్ రెండక స్టేజిలో 110 మెగావాట్స్ విద్యుత్తుని ఉత్పత్తి చేయ గలుగుతోంది. మొత్తం ఇది నాలుగు యూనిట్లు. 30 అ॥ల డైవర్షన్ టనెల్

✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣


Form IV (Rule 8

As Prescribed in the Registration of Newspapers
(Central Rules 1956)

STATEMENT ABOUT OWNERSHIP
OF 'JAGATI' (Telugu)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | 2, Kutchery Road<br>Madras-600 004 |
| 2. | Periodicity of its Publication | Monthly |
| 3. | Printer's Name<br>Whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2 - Kutchery Road<br>Madras - 600 004 |
| 4. | Publisher's Name<br>Whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2 - Kutchery Road<br>Madras - 600 004 |
| 5. | Editor's Name<br>whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2 - Kutchery Road<br>Madras - 600 004 |
| 6. | Names & addresses of individuals who own the Newspaper | N. R. Chendur<br>Sole Proprietor<br>2 - Kutchery Road<br>Madras - 600 004 |

I, N. R. Chendur, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

N. R. CHENDUR

28th Feb. 1990 Signature of Publisher

(పొడవు: 2250 అ॥:) 50 అ॥ల డైవర్షన్ ఛానల్ (పొడవు: 1950 అ॥లు). ఈ హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్ట్ కారణంగా 86 గ్రామాలలోని ప్రజలను ఖాళీచేయించవలసి వచ్చింది. 21 వేల కొత్తఇళ్లు కట్టించారు. 27 వేల కుటుంబాలకు పునరావాసం కల్పించారు. ఆధునిక కాలంలో ఏదేశప్రగతి అయినా విద్యుదుత్పత్తిమీద ఆధార పడి వుంటున్నది..... ప్రసాదాలతో వారు వచ్చాక, టిఫిన్ తీసుకు, నిన్న చూడని శిఖరానికి బయలుదేరాము. శిఖరం మీద నుంచి చూస్తే, ఆలయం లోని నాలుగు గోపురాలు, నీలకాంతిలో నదీజలం కనిపిస్తాయి. అక్కడ అర్చకుణ్ణి 'శిఖరంమీద ఈ ఆలయం ఎన్నాళ్లబట్టీ వుంది ?' అని అడిగింది మాలతీ. రామాయణకాలం నుంచీ అని చెబుతాడని అనుకుంది. కాని అయన 'ఈస్వామి యిక్కడ సృష్టికి పూర్వమే వెలిశాడు' అనేసరికి, ఆమెకి నోట మాట రాలేదు... అక్కడనుంచి గెస్ట్ హావుస్‌కి వచ్చేసరికి కృష్ణమూర్తి గారు వచ్చివున్నారు. గాయకురాలు లక్ష్మి, అమె బృందమూ, బంధువులూ కూడా వచ్చివున్నారు. పరస్పర పలకరింపులయాక, మారూమ్‌కి వెళ్లిపోయాం భోజనాలకి. రుచికరమైన వంటకాలతో కడుపునిండా భోజనం పెట్టాడు విజయరత్నం. భుక్తాయాసంతో కాసేపు నిద్ర ; నాలుగుగంటలకి మళ్లీ స్నానం చేసి, రెడీ అయాం. నాకూ, రాధకు, శారదకు ఏ దిగులూలేదు, నిర్విచారం, అని, దిగులంతా మాలతికి ; సాయింత్రం వేదికమీద సందర్భోచితంగా ఏదైనా మాట్లాడాలి. 'ప్రిపేర్ అయివచ్చినప్పటికీ రిఫర్ చేసుకోకుండా చెప్పాలని ఆమె తాపత్రయం. అదీకాక, వారంవారం లక్షలాది పాఠకుల మదిలోమెదిలే 'మాలతీ చందూర్' ఇమేజ్‌కి తగ్గట్టుగా హుందాగా గంభీరంగా చెప్పాలని ఆమె తపన. ఆ దిగులుతో ఆమె మంచంమీద దొర్లిందే తప్ప నిద్రపోయినట్టులేదు - మాముగ్గురికీ ఏచింతాలేదు. కనిపించిన వాళ్లతో కరువుదీరా కబుర్లు చెప్పడమే మాపని..... ముఖ్యఅతిథి వెంటనున్నవారం కాబట్టి ఒక పావు గంటముందుగా వెళ్లడం మర్యాద ! శ్రోతలు నెమ్మది నెమ్మదిగా వస్తున్నారు. మెడికల్ ఆఫీసరు ఈశ్వర రెడ్డి, 'జనాభా పెరుగుదలని అరికట్టితే తప్ప మనదేశ సమస్యలేవీ పరిష్కారం కావు - సంవత్సరానికొక ఆస్ట్రేలియాని పెంచుతున్న మన అవిద్య, అవివేకం, అజ్ఞానం అవధులు దాటిపోతున్నాయి' - అన్నారు. అయన అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించే దృక్పథం నాది .... తెలుగు విశ్వవిద్యాలయం కల్చరల్ సెంటరుకి డైరక్టరైన తిమ్మారెడ్డి (ఆంధ్రా యూనివర్సిటీలో ఆంత్రోపాలజీ ప్రొఫెసరు - తాత్కాలికంగా యిక్కడ కొచ్చారు). 'శ్రీశైల ప్రాంతాల లక్ష సంవత్సరాలక్రితమే నరసంచారం ఉన్నట్లు దాఖలాలు కనిపిస్తున్నాయి' - అన్నారు. వెంటనే నాకు కాశీపాండ్యన్ ఐఎయస్ వ్రాసిన పుస్తకం గుర్తుకివచ్చింది. 'రేణిగుంటలో



?

"Lord Krishna and Lord Rama started showing their courage and valour by killing the she-demons like Pootana and Tataka..." observed Raghu.

"What is wrong in it ? That is how the character has been etched out and evolved to be cherished as the darling of millions," said Father.

"Rama was barely fifteen when taken by Viswamitra to the hermitage. To the eulogy of the gods above, he killed Tataka and established his supremacy. Thereafter Viswamitra taught him *Mantras* to do away with the two demon-boys. The Sage himself could have done that - why this intermediary ?"

"No doubt, it is a pertinent point. Those two demon-boys, as you call them, Maricha and Subahu, appeared on the scene only on the seventh day of *Yaga*. The first six days and nights passed off quite peacefully. While doing *Yaga*, a sort of ritual *Tapas*, one should not subject himself to anger - *Rajo Guna*. That would be detrimental to the very purpose of the *Yaga*. As such, though Viswamitra could easily annihilate both the devils, he had to seek the assistance of Rama in order to preserve his *Satva Guna* till the completion of the *Yaga*," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



ఏభైవేల ఏళ్లక్రితం జనసంచారం ఉండే దని కాశీపాండ్యన్ వ్రాశారు - మద్రాసు దూరదర్శినివారు అరవైఏళ్లక్రితం తమిళనాడు గుహలలో మనుషులు వుండేవారని ఆ గుహలు చూపించారు. నీడంర్తాల్ కి సమకాలీనుడైన 'పెకింగ్ మాన్ పురె' ఏభైఏళ్ల క్రితంది అని కదా అంటున్నారు. ?' - అని అడిగాను. 'కార్బన్, రేడియమ్ టెస్టులు గాక ఇప్పుడు ఫాస్పరస్ టెస్ట్ వ్యాప్తిలోకి వచ్చింది. దానిని బట్టి అతి పూర్వీకుని వయసు 4 లక్షల 50 వేల సంవత్స రాలు అంటున్నారు' - అని చెప్పారు తిమ్మారెడ్డి. ఆయన ప్రొఫెసరు, ఆ విషయం క్షుణ్ణంగా తెలిసిన వారు. కాని, ఎందుకనో, నాకు అలవడ్డ స్వల్పజ్ఞానాన్ని బట్టి అదిసహేతుక మనిపించలేదు. "నాలుగులక్షల సంవ త్సరాల క్రితం 'యాంత్రోపాయిడ్ ఏప్స్' ఉండవచ్చు. పెకింగ్మాన్పురె' బయటపడటానికి పూర్వమే, లక్ష సంవత్సరాలకు పైగా 'హొమొ - సాపియన్స్' ఈ భూమ్మీద తిరుగాడు తున్నట్లు అంగీకరించారు. ఎటొచ్చీ, వారు చెప్పేదేమిటంటే, గడిచిన హిమ ప్రళయంలో - గ్లాసియర్ఏజ్ పాతికవేల ఏళ్లక్రితం వచ్చినది - ఆ గ్లాసియర్ ఏజ్లో హొమొ సాపియన్స్ తమ సంతతి సర్వనాశనంగాకుండా కాపాడు కోగలిగారని అంటారు. నదీలోయల నుంచే వ్యవసాయమూ, పసరిక భూముల నుంచే పశుసంపద ! లాస్ట్ గ్లాసియర్ ఏజ్ కదా, సైంటిఫిక్గా నరజాతి చరిత్రకు ప్రథమాంకం' అన్నాను. 'మీరంటున్నదీ నిజమే' - అన్నారు తిమ్మారెడ్డి. ఆ ఆర్గుమెంట్ అక్కడితో ఆగిపోయింది - ఇంతలో లోనికి పిల్చారు.... ప్రసాద్ ప్రయోక్త గా గాయని లక్ష్మి, అన్నమాచార్య సం కీర్తన ప్రారంభించారు. శుక్రవారం ఆమెకు ఉపవాస దినమవడం వల్ల, లోగడ 'రవీంద్ర భారతి'లో పాడినట్టు గా(1989 అక్టోబరు 24) లేక పోయి నప్పటికీ, భక్తితత్పరత ఆ కంఠంలో కనిపించింది. గంటన్నరసేపు ఎంతో శ్రావ్యంగా పాడారు. ఈనాటి సభకు అధ్యక్షులైన తిమ్మారెడ్డి మొదట్లో మాట్లాడారు. మాలతిని మంగళచరణా నికి ముందు మాట్లాడమన్నారు. శ్రీశైలం గురించి, అన్నమాచార్యుని గురించి రెండురోజులపాటు ఎంతో మేటరు సేకరించి ఉపన్యాసపాఠం, పాయింట్లు రాసుకుంది. ఈ కార్య క్రమానంతరం విద్యార్థినీ విద్యార్థులకు 'రిపబ్లిక్ - డే ప్రయిజ్ డిస్ట్రిబ్యూషన్' ఉంది - వాళ్లందరూ వచ్చి హాలులో కూచున్నారు - తమ బహుమతులు ఎప్పుడు పుచ్చుకుందామా అనే ఆత్రంతో ! ఆ 'మూడ్' గ్రహించిన మాలతి, అయిదునిమిషాలకు మించి తాను ఎక్కువ మాట్లాడనని హామీ యిచ్చి, కృష్ణమూర్తిగారిని, లక్ష్మిని, మిగతా వాద్యకారులని అభినందించి, తన పదకవిత ద్వారా అన్నమయ్య, క్షేత్రయ, రామదాసు, త్యాగరాజులకు మార్గదర్శకుడయాడని క్లుప్తంగాచెప్పి, అయిదు నిముషాల్లో ముగించిందామె. తెర వెనకకు వచ్చారు పాతికముప్ఫయి

మంది మాలతిని పలకరించేందుకు, ఫొటోదిగేందుకు! నేనది చూడలేదు - ప్రక్కవారితో ఏదో మాట్లాడుతున్నాను. 'మాలతిగారు మిమ్మల్ని పిలుస్తున్నారు' అని కబురు వచ్చింది. మాలతీచందూర్ లోని ద్వితీయార్థం ఎలా ఉంటారో చూదామని నన్ను పిలిపించడం మామూలే-అదేమీ కొత్త కాదు. అయితే యిక్కడివారు ఆమె ఒక్కరేకాదు - మా గ్రూప్ ఫొటోలో మీరిద్దరూ ఉండాలి' అన్నారు. భావార్ధములవలె మమ్మల్ని ఒకటిగా చేసిన ఆ నారీమణులకు మా కృతజ్ఞత.... వెలుపలికొచ్చాక, 'నేనూ, మాలతిగారికి మల్లే మా మామయ్యని చేసుకున్నాను' అన్నది హిమబిందు, ఇంజనీరు మురళీధర్‌ని పరిచయంచేస్తూ - విజయలక్ష్మి అనే ఆమె మాలతికి పెన్ సెట్ బహూకరించారు - ఆమె యడ్రస్ కూడా తెలీదు 'థాంక్స్' రాసేందుకు... రెస్ట్ హవుజ్ కొచ్చాక కృష్ణమూర్తిగారు 'రేపు అహోబిలం, మహానంది - అక్కడ నుంచి కడప మీదుగా మీరు మద్రాసు వెళ్లవచ్చు' అని బేరంపెట్టారు. కానీ, యిక్కడ పనులుండటం వల్ల ఒంగోలు మీద గానే వచ్చెయ్యటానికి నిశ్చయించు కున్నాం. 31 సాయింత్రం ఫ్లయిట్‌కి రాధ కలకత్తా వెళ్లవలసివుంది - యిల్లంతా సర్దుకోవాలామె... ఇందాక మధ్యాహ్నం కాబోలు అడిగాను రాధని: 'ఏమండీ, అమెరికాలో అయిదేళ్లు వున్నారు. అక్కడ మీకూ మీ వారికీ కూడా ఉద్యోగం ఉందాయె. అందరూ అమెరికాలో స్థిరపడి పోవాలని కలలు కంటూవుంటారు, అటువంటిది మీరక్కడ వుండిపోగల ఛాన్సు వుండికూడా, ఎందుకు ఇండియా వచ్చేశారు?'... 'మా అబ్బాయి, అమ్మాయి అక్కడ పెరగటం నాకిష్టం లేకపోయింది. మా వరహా పట్నం కంటె, మన ఆంధ్రా కంటె, మన మద్రాసుకంటె అమెరికా ఏం గొప్ప? మావారు ఫిఫ్టీగా ఫిఫ్టీగావున్నా నేను ఖచ్చితంగా ఇండియా వెళ్లి పోతున్నామని చెప్పాను. జనని, జన్మభూమి తర్వాతనే కదండీ మిగతావన్నీ! శివస్వామి అమెరికాలో ఎందుకు ఉద్యోగం చేయాలి? ఇండియాలో, మనకున్నంతలో, హాయిగా వుండ వచ్చుకదా!' - అన్నారు రాధ. అటువంటి మనోధృతి గలవారు చాలా అరుదుగా కనిపిస్తారు ఈ రోజులలో. తన గురించి అంతకంటె ఎక్కువ చెబితే కోప్పడుతుంది రాధ.

. . . . . 27

అయిదున్నరకి అందరి వద్ద ...లు తీసుకు బయలుదేరాం. శిఖరం వద్ద ఘాట్ రోడ్ గేటు ఆరు గంటలకి గాని తెరవరు. దొర్నాల చేరువలో మిరపళ్ల తోట వద్ద ఆగి, తోటలోకి వెళ్లి రెండు సంచీల నిండా, మోయగలిగినన్ని మిరపళ్లు పట్టుకొచ్చారు. ఆ తర్వాత మార్కాపురంలో ఒక చిన్న హొటల్ వద్ద ఆగాం - ప్లేటులో ఆకు వేసి, వేడి వేడి యిడ్లీ కారు వద్దకు పట్టుకు వచ్చి యిచ్చాడు సర్వరు. ఒక్కొక్కరం నాలుగైదు

యిడ్లీ తినివుంటాం - సైజులో చిన్న వైనప్పటికీ చాలా రుచిగా ఉన్నాయి. ఆ పైన కాఫీలు. డ్రయివరు చంద్రన్ కూడా ఇడ్లీ, కాఫీ తీసుకున్నాడు. 'బిల్లు ఎంత ?' అని సర్వ్ చేసిన అబ్బాయిని అడిగేసరికి, ఎనిమిదిరూపాయల ఇరవై పైసలు - అన్నాడు. మాకు నమ్మ శక్యం కాలేదు. పదిరూపాయలు నోటు యిచ్చి మిగతాది ఆ అబ్బాయిని తీసుకో మన్నాము. నెక్స్టట్ హాల్ట్ ; ఒంగోలు కూరల మార్కెట్. సంచులు లేవు కాబట్టి కొత్త సంచులు కొన్నారు - ఆనపకాయలు, దోసకాయలు, వంకాయలు, ఏమిటేమిటో కూరలు తెచ్చారు. ఇవి మద్రాసులో దొరకవని కాదు - ఒక రూపాయి తక్కువైనంత మాత్రాన కలిసొస్తుందనీ కాదు - మన ప్రాంతం నుంచి తెచ్చామన్న తృప్తి, వంట చేసే గృహిణికే తెలుస్తుంది. మార్కెట్‌లో తిరిగొచ్చాక కొబ్బరి బొండాలు.... ఆ తర్వాత హెూటల్ సింహపురిలో (నెల్లూరు) లంచ్ - బెండకాయకూర బావుందని మళ్లీ వడ్డించుకున్నారు.... అయిదున్నరయేసరికి మద్రాసు. ఎటువంటి యిబ్బందీ లేకుండా, పదకొండు వందల కిలోమీటర్లు సునాయాస ప్రయాణం చేయించింది అడయార్ కాబ్స్‌వారు పంపిన యంబాసిడర్ ; చంద్రశేఖరశర్మ ఎంతో సమర్థుడైన డ్రయివరు.... ఇవ్వాళ ఏక భుక్తం చాలనుకొని, కాఫీ తాగి స్నానం చేసి, ఎనిమిదిన్నరకే నడుం వాల్చి, ఉదయం అయిదున్నర చర్చి గంటలతో కళ్లు తెరిచి, రొటీన్‌లో పడ్డాం.

. . . . . 28

విజయాధినేత నాగిరెడ్డి మనుమరాలు సౌ॥ లక్ష్మి ఆరతికి (బియల్లెన్ ప్రసాద్ దంపతుల కుమార్తె), డి శేషారెడ్డి దంపతుల కుమారుడు చి॥ సుబ్బారెడ్డికి విజయా శేష్‌మహల్‌లో వివాహ మహెూత్సవం. మంత్రులూ గవర్నర్లూ ఎందరెందరో ప్రముఖులూ ప్రఖ్యాత వ్యక్తులూ నవదంపతులను శుభాక్షితలతో ఆశీర్వదించారు.

. . . . . 30

ఇవ్వాళ పూజ్య బాపూజీ 42 వ వర్ధంతి. కొన్ని పవిత్ర దినాలలో గాంధీ మండపాన్ని, రాజాజీ మెమోరియల్ని సందర్శించడం గోపాలరెడ్డి గారి అలవాటు. పొద్దుట వెళ్దామని నిన్ననే చెప్పారు. గాంధీ మండపంలో సాయింత్రంవేళ ప్రార్థనలు ఉన్నాయట. మేము ఉదయం పూట వెళ్లాము. ఆ మండపంలో తిరుగుతున్నప్పుడు, గోపాలరెడ్డిగారి స్మృతి పేటిక ఎటువంటి ఝుంకారాలకు లోనవుతుందో మనం తెలుసుకోలేము. అంతర్ముఖులై, మధ్య మధ్య ఒకటో రెండో మాటలు చెబుతూ, ఆ జ్ఞాపకాల మధ్య పర్యటిస్తారు పూజ్యులు గోపాల రెడ్డి. ఒకప్పుడు దేశ్‌ముఖ్ దంపతులు, ఆ తర్వాత గోపాలరెడ్డిగారు మాకు ఒకవిధంగా దిక్సూచి వంటివారు. ఆ మహనీయునితో ఆ పవిత్ర స్థలాలు చూసి రావడం ఒకవిధంగా నా భాగ్యం.... సాయింత్రం అయిదున్నరకి పొట్టి శ్రీరాములు హాలులో

అభ్యుదయ రచయితల సంఘంవారి 'స్వాతంత్ర్య వీరుల స్మృత్యంజలి'.... చాలామంది తమ కవితలు చదివి వినిపించారు గాని ఉపద్రష్ట సాయి, మల్లిక్, చెరువు ఆంజనేయశాస్త్రి, సరోజినీ ప్రేమ్‌చంద్ చదివినవి మాత్రం గుండెను గుచ్చుకొనేటట్టు వున్నాయి. గాంధీ వర్ధంతి సందర్భంగా కవితా సుమాల నర్పించడం ముదావహమైన విషయం.

. . . . . 31

ఎవియమ్‌లో విజయ కృష్ణావారి 'ప్రజలమనిషి'కి ముహూర్తం. నాగూర్ బాబు, సుశీలల 'తెలుగింటి చిలకా - సౌందర్య తిలకా' అనే గీతిక యివ్వాళ రికార్డ్ చేస్తున్నారు. దర్శక నిర్మాత : విజయనిర్మల. 'కొడుకు దిద్దిన కాపురం' శతదినోత్సవ సందర్భమైన ఏలూరు విశేషాలు చెప్పారు కృష్ణ.... బరోడా యూనివర్సిటీలో రెండు 'ఎమ్ఏ'లు తీసుకు, అమెరికా (అయొవా) వెళ్లి, పిహెచ్‌డి పుచ్చుకున్న భారతి ము:ఖ 'ది టైగర్స్ డాటర్' (The Tiger' Daughter) అనే తన మొదటి నవలని 1972 లో పబ్లిష్ చేశారు; ఆ తర్వాత నవల పేరు 'వైఫ్' (Wife) 'డార్క్‌నెస్' (Darkness) అనే కథా సంపుటి ఆమెకి గుర్తింపుతేగా, 'మిడిల్‌మాన్' (Middleman and other Stories) అనే మరొక కథా సంపుటి 1988 బుక్‌క్రిటిక్స్ అవార్డ్ ద్వారా ఆమె పేరుని ఖండాంతరాలకు వ్యాపింపజేసింది. 'జాస్మిన్' (Jasmine) ఆమె లేటెస్ట్ నవల - పెంగ్విన్‌వారు ప్రచురిస్తున్నారు. ''ఇమ్మిగ్రెంట్స్ (వలస వచ్చినవారు) అమెరికన్ ప్రజావాహిని తో కలిసిపోయేందుకు మానసికంగా సంసిద్ధులవాలి. 'మార్పుని' ఆమోదించి ఆచరణలో పెట్టగల ఆత్మబలంవారి కుండాలి. వెనకటి సంస్కృతీవాసనల నుంచి విముక్తులై, కొత్తవాటిని స్వీకరించగలగాలి'' - అన్నారు

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే జోక్స్, నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు, మా ఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P. B. 2922 - Madras-600 004

ముఖర్జీ అమెరికన్ సెంటర్లో.... 'యు యస్ ఐ యస్' డైరక్టరు చాలినార్, ఆమె గౌరవార్థం లింకన్ హవుస్‌లో ఇచ్చిన డిన్నరులో, మాలినీ శేషాద్రి, మారన్, శివశంకరి, అశోకమిత్రన్, ఐఐటి కృష్ణారావు, తిలకావతి, అమెరికన్ సెంటర్‌లోని కొందరు ఆఫీసర్లు - మొత్తం పాతికమంది ఉంటారు. భారతీ ముఖర్జీ మా యిద్దరితో చాలా చనువుగా మాట్లాడారు. టాగూర్ శరత్‌లకు చెందిన వంగభూమి వనిత కదా - ఆ ప్రభావం ఎక్కడికి పోతుంది? .... ఆమె గురించి మాలతి వేరే రాస్తోంది కాబట్టి యితర వివరాలు యిక్కడ అనవసరం.

## 1990 ఫిబ్రవరి 01

'నేను మొట్టమొదట నాటకంలో వేషం వేసేందుకు అయిదు రూపాయలు ఎదురిచ్చాను. ఆ అయిదూ ఒకసారి యివ్వలేక వాయిదాల పద్ధతి మీద చెల్లించాను.... నా ఫిలిమ్ యాక్టింగ్‌కి హోమియోపతీ వైద్యం ఎంతగానో సహాయపడింది' - అన్నారు పద్మశ్రీ అల్లురామలింగయ్య, ఈ ఉదయం వారింట్లో జరిపిన పత్రికా సమావేశంలో. ఢిల్లీలోని ఆంధ్రులు తనకి 'పద్మశ్రీ' వచ్చాక, ఎంత ఘనంగా గౌరవించినదీ చెప్పారాయన.

## ..... 02

మద్రాసు ప్రెస్ క్లబ్బూ, రాజాలక్ష్మీ ఫౌండేషనూ సంయుక్తంగా శ్రీనివాస శాస్త్రి హాలులో 'యటూనమీ

## ముఖచిత్రం

దర్శకులు దాసరి నారాయణరావు ముఖ్య అతిథిగా, మద్రాసు మ్యూజిక్ అకాడమీలో, 1989 మే 31 వ తేదీన, 47వ జన్మదినోత్సవం జరుపుకుంటూ హీరో కృష్ణ, 48 వ జన్మదినం కాంగ్రెస్‌పార్టీ పాలనలోకి వచ్చిన ఆంధ్రాలో, హైదరాబాదు రాజధానీ నగరంలో జరుపుకుంటానని అన్నప్పుడు, అవి రాజకీయ వేత్తల జోస్యాలని, అనుకున్నారు చాలామంది. కృష్ణ-విజయనిర్మల అప్పటికే కాంగ్రెస్ ప్రచారంలో భాగస్వాములై ఉన్నారు కాబట్టి! 'తెలుగు దేశం' తక్కువ మెజారిటీతో వస్తుందే తప్ప, ప్రతిపక్షంలో కూర్చోవలసిన పరిస్థితి ఏర్పడుతుందని ఆనాడు ఎవరూ ఊహించలేక పోయారు. ఏలూరు నియోజకవర్గం నుంచి హీరో కృష్ణ లోక్ సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా నిలబడటం, అక్కడ 9 లక్షల 21 వేల ఓట్లలో 79 శాతం పోలవడం, సమీప ప్రత్యర్థిపై 71,417 ఓట్ల మెజారిటీతో కృష్ణ నెగ్గడం అందరికీ తెలిసిన విషయం. ఇన్నాళ్లూ 'సాహసమే ఊపిరి'గా, అధికారపక్షాన్ని అనేకానేక పాత్రల్లో ఘాటుగా విమర్శించి కరతాళ ధ్వనులందుకున్న కృష్ణ, ఏలూరు బైపాస్‌రోడ్డు, డ్రైనేజిస్కీము, బడుగువర్గాల సంక్షేమం, ప్రజాహిత పథకాలు వంటివి అమలు జరిపించడం ద్వారా, నిర్మాణాత్మక కృషిద్వారా, తన రాజకీయ భవితవ్యం నిరూపించుకోవలసివుంది.

# క్షయ రోగంతో పోరాడండి

1 రెండు వారాలకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు. ఊపిరి తిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు.

2. మీ సమీప మందలి ప్రాథమిక ఆరోగ్య కేంద్రం. డిస్పెన్సరీ లేక టి- బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి.



3 నిర్ధారిత సమయం వరకు. క్రమంగా. డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే. క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4. చికిత్స కంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బి.సి.జి టీకాలు వేయించండి.




సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి.జి హెచ్.ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు, న్యూ ఢిల్లీ 110002

davp 89/1023 Tel

ఆఫ్ ది మీడియా' (Autonomy of the Media) అనే అంశంపై సెమినార్ జరిపారు. కార్యక్రమ నిర్వహణ: ప్రెస్ క్లబ్ అధ్యక్షులు డి అంజనేయులు. కాశ్మీర్‌లో జరుగుతున్నది పత్రికల వారి కంటబడకుండా జాగర్త పడుతున్న ప్రభుత్వం దూరదర్శినికి, రేడియోకి 'యటానమీ' నిజంగా యివ్వగలదా? - అని ప్రశ్నించారు 'తుగ్లక్' సంపాదకులు ఛొ - రామస్వామి. రెండూ విడి విడి కార్పొరేషనులైతే బావుంటుందని సూచించారు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ రామనాధన్. మల్టీనేషనల్స్‌కి అమ్ముడు పోయిన అమెరికన్ పద్ధతి మనకి సుతరామూ వొద్దన్నారు కృష్ణస్వామి. అనుకోకుండా వచ్చిన కేంద్ర సమాచార మంత్రి ఉపేంద్ర 'ప్రసార భారతి' బిల్లు గురించి సుస్పష్టంగా పండు వొలిచి పెట్టినట్లు చెబుతూ, "తగు 'చెక్స్'తో దీనిని రూపొందిస్తున్నాము; ఎంతటి సత్కార్యమైనా, దానిని అమలుపరిచే వ్యక్తుల చిత్తశుద్ధి మీద ఆధారపడి వుంటుంది కదా!" - అన్నారు. (దూరదర్శినికి, ఆకాశవాణికి సాలీనా అయే ఖర్చు రు 800 కోట్లు - ఇందులో 200 కోట్లు దూరదర్శినికి, 30 కోట్లు ఆకాశవాణికి వ్యాపార ప్రకటనల ద్వారా లభిస్తోంది - మిగతా రు 570 కోట్లు కేంద్రం భరిస్తోంది) ఎ ఆర్ బాజీ, యమ్మెస్ గోపాల్, ఎ యస్ రామన్, ఎ రంగనాధన్ మున్నగు వారు ప్రసంగించారు. బి యస్సార్ కృష్ణ స్వాగతవచనం; శౌరి వందన సమర్పణ. ఉపేంద్ర, యిద్దరు ముగ్గురు స్పీకర్లు తప్పితే మిగతావారు, తమ అభిప్రాయాలు వ్యక్తం చేశారేగాని స్వయం ప్రతిపత్తి (యటానమీ)లోని సాధకబాధకాలు తర్కించలేదు. ❋

—యన్నార్ చందూర్

ఈ లోకంలో మంచీ చెడూ అనేవి లేవు. మన భావనే వాటికి మంచితనాన్నీ చెడుతనాన్నీ ఆపాదిస్తోంది.

—షేక్స్‌పియర్

మనం నేర్చుకోవలసిన ముఖ్యపాఠమేమిటంటే, మనకి యిష్టమైనది చేయడంగాక, చేస్తున్నది యిష్టపడటం.

— బ్లేక్

పగిలిన గుండెను భగవంతునికి సమర్పిస్తే, బీటలుపోయి అది యధాప్రకారమవుతుంది. నిండు గుండెను వనితకు అర్పిస్తే, అది బీటలు వారుతుంది.

—ప్రెస్ట్ విచ్

మీలోగల బలహీనత నుంచి మీరు పారిపోలేరు. ఏదో ఒకనాడు దానిని ఎదుర్కొని జయించనైనా జయించాలి - లేదా, దాని ముందు మీ వోటమినైనా అంగీకరించాలి. అంచేత, ఆ పోరాటమేదో ఇప్పుడే ప్రారంభించకూడదు?

—స్టీవెన్సన్

